# సమగ్ర
# యంత్ర రత్నాకరము

(గ్రహ,వాస్తు యంత్ర విశిష్ట పూజా విధాన సహితము
యంత్ర విశిష్టత, యంత్ర సంస్కార, జీవకళాన్యాస
ప్రాణప్రతిష్ఠ క్రియా సహితము)

రచన - సంకలనము :

**శ్రీధర వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి**

(జ్యోతిష, వాస్తు, సంఖ్యాశాస్త్రజ్ఞులు)



**జె.పి. పబ్లికేషన్స్**

Opp హోటల్ ఐలాపురం, గాంధీనగర్,
విజయవాడ - 3 ఫోన్ 5527484

# సమగ్ర యంత్ర రత్నాకరము

(గ్రహ, వాస్తు యంత్ర విశిష్ట పూజా విధాన సహితము)

*by* శ్రీధర వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

ప్రథమ ముద్రణ

**జులై, 2003**



వెల : **రూ. 30/-**

డి టి పి

**కాలర్ స్ట్రీమ్స్, హైదరాబాద్**

కవర్ డిజైన్

**రమణ**

ముద్రణ

**స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ.**

పబ్లిషర్స్

**జె.పి. పబ్లికేషన్స్,**

Opp **హోటల్ ఇలాపురం, గాంధీనగర్,**

**విజయవాడ - 520 003 ఫోన్ : 5527484**

# విషయ సూచిక



**యంత్రములు - పూజా విధానములు**

శ్రీ గణేశాయనమః
ఓం శ్రీ గురు దత్తాత్రేయానమః

# సమగ్ర
# యంత్ర రత్నాకరము

ప్రపంచమునందలి అతి ప్రాచీనమైన హిందూ సంస్కృతికి సంబంధించిన వైదిక సాహిత్యము నందు మనకు "యంత్రము" లకు సంబంధించిన సశాస్త్రీయమైన అనేక విషయాలను విశదీకరిస్తూ మనకు కనిపిస్తాయి.

"యమనాత్ త్రాయత ఇతి యంత్రము" అనగా బాధల నుండి రక్షించేది, అనే అర్థం నిర్వచింపబడింది. సకల దుఃఖ నివారణ గావించునదే యంత్రమని ఆగమ శాస్త్రజ్ఞులు నిర్వచించారు.

"నారద పురాణము" నందు కూడా యంత్రాన్ని విష్ణు ప్రతిమతో సమానమైననదిగా పేర్కొనుట జరిగినది.

ఆపోగ్ని హృదయం చక్రం విష్ణోః క్షేత్ర-సముద్భవమ్ ।
యంత్రంచ ప్రతిమా స్థాన మర్చనే సర్వదా హరేః ॥

అంటే - జలం, అగ్ని, హృదయం చక్రం, విష్ణు క్షేత్రంలో ఉద్భవించిన వస్తువులు, యంత్రము - ఇవన్నియు విష్ణువుతో సమానముగా పూజనీయములు అని భావము.

యంత్రము అనగా దేవతలకు నివాసయోగ్యమైన గృహము. దీనినే దేవనగరమని, దేవతావాసస్థానమని ఆర్యులు నిర్వచించిరి. ఈ విధంగా యంత్రస్థమైన సమస్త దేవతా పరివారము సకల దోషములను నివృత్తి జేసి మానవకోటికి శుభంబుల నొసగుచున్నవి. కావున యంత్రములను కూడా సిద్ధిజేసి, పరిపూర్ణమైన పంచోపచార పూజమొదలైన ప్రక్రియలన్ని జరిపి స్థాపన చేయుటవల్ల పరిపూర్ణ ఫలితాలను ఇచ్చును. ఈ విధంగా యంత్రం అత్యున్నత స్థానంలో ఉండును.

మంత్రము, తంత్రము - ఈ యంత్రమునకు సాధక తత్వాలుగా ఉండును. మరి "మంత్రం" అనేది సూక్ష్మమైన మహత్వ పూర్వకమైన తత్వము. ప్రకృతిని కూడా వశము చేసుకొనగల శక్తి మంత్రమునకున్నది.

"ఇద మధం తమః కృత్స్నం జాయేత భువన త్రయమ్ ।
యది శబ్దాలయం జ్యోతి రా సంసారాన్న దీప్యతే ॥

సృష్టి ఆరంభములో కనుక, శబ్ద రూపమైన జ్యోతి స్వరూపము లేకపోయిన యెడల, త్రిలోకములన్నీయు అంధకారము నందు మునిగి యుండెడివి.

వావర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ ॥

జీవన మూలాధారం సాధన, దానికి మూలం శబ్దం. ఎందుకనగా శబ్దం లేనిచో అర్థోత్పత్తి సాధ్యం కాదు. కావున వాగర్థాల రెంటి సంబంధం - శివశక్తుల సంబంధం. శక్తి యొక్క మూలము నందు శబ్దమే పరిభ్రమించు చుండును. తంత్రోక్తని రూపణమునందు - 'మహా మంత్రమనియు" పిలిచేదరు.

మానవుడు నోటితో ఉచ్చరించిన శబ్దముగాని, ధ్వనిగాని మంత్ర రూపాన్ని పొందును. ఈ ధ్వని, శబ్దములనే ఒక క్రమములో కూర్చబడిన యెడల మంత్రమ రూపాన్ని పొందుచున్నది. ఈ జీవి పుట్టుట నుండి, గిట్టు నంతవరకు షోడశ సంస్కారాలు జరుగుచునే ఉండును. ఈ సంస్కారములకు.

కావున నర్థాలవముగా చెప్పవలెనన్న - మంత్రములు - శబ్ద ప్రాధాన్యములనియు, యంత్రములు బీజాక్షర ప్రాధాన్యము లనియు తెలియగలదు. అంతియే గాక - యంత్రము దేహమైన, మంత్రము ఆత్మ శక్తిగా గ్రహించనగును. ఎప్పుడు యంత్రమును దేహముగా గ్రహించినామో దానికి షోడశ సంస్కారములుండును. వీటికి పదునాలు మర్మ స్థానములు గలవు.

సృష్టి ఆరంభములో పరమేశ్వరుడు చేసిన నృత్యము నుంచి పదునాలుగు విధములైన వర్ణాలు నిర్మిత మగుటచే మంత్రములు స్వయం శక్తి వంతములైనవి. పరాశక్తి ఇచ్ఛామూలముగా నవబిందువులు ఏర్పడి, వాటి పరస్పర కలయిక వలన యంత్రము లేర్పడినవి. ఈ యంత్రములు బీజాక్షర యుక్తములై, చైతన్య వంతమై సృష్టి, స్థితి, లయములకు కారణ భూతమగుచున్నవి.

దేహము నందు గల షట్చక్రములను - యంత్రములుగా అందు జనించు వివిధ శబ్దములను మంత్రములుగా భావించు చుండెడి వారు మన బ్రహ్మ విదులు.

మంత్రము అనగా :- "మననాత్ త్రాయతే యస్మాత్ మంత్ర మిత్యభిధీయతే" - అనగా మననము చేయు వానిని రక్షింపగల్గునది మంత్రము అని ప్రమాణము. " మంతారం తారయ తీతి మంత్రః - అనగా జపించు, వానిని తరింపచేయగల శక్తి గలది మంత్రము.

శ్లో ॥ మకారం మననం ప్రాహుస్త కారస్త్రాణ ఉచ్యతే ।
మనన త్రాణ సంయుక్తో మంత్ర ఇత్యభిధీయతే ॥

'మ' కారము అనగా మననము జేయునది - అంటే పదేపదే ఉచ్ఛరించుట "త్ర" కారము అనగా త్రాణము అనగా రక్షించునది అర్థము. పలుమార్లు ఉచ్ఛరించు వారిని రక్షించునది మంత్రము.

కావున - ఈ యంత్ర, మంత్రములను సిద్ధింప జేసుకొనవలెనన్న, ముందుగా ఈ రెంటి యొక్క సమగ్రతత్త్వమును తెలుసుకొని అర్థము జేసుకొనుట అత్యంతావశ్యకరము.

## యంత్రాలు - తత్త్వాలు

పంచతత్త్వాలతో అనగా పృథ్వి, జలం, అగ్ని, వాయువు ఆకాశం వీటికి సంబంధించిన పంచతత్త్వాలు రేఖా యంత్రాలు లేక అంక యంత్రాలందు సమ్మిళితం చేయబడతాయి. ఇందు పృధ్వికి సంబంధించిన రేఖలు -చతురస్రంగా, చమష్కోణాత్మకంగా ఉంటాయి. జల సంబంధమైన రేఖలు వృత్తాకారంగ్గాను సూచించబడును. అగ్ని సంబంధితమైన రేఖలు త్రికోణాకృతిలోను, వరుణ రేఖలు త్రివృత్తంగా, మూడున్నర ఆవర్తములతో లిఖిస్తారు.

త్రికోణం - ఊర్ధ్వముఖమైన శివుని, అధోముఖమైన - పార్వతిని సూచించును. పంచదశీ యంత్రము నందు గూడా ఈ తత్త్వాలు కానవచ్చును. ఈ తత్త్వాలకు ఆకృతులు నిర్దేశితమై వాటికి సంబంధించిన బీజాక్షరాలు కూడా, ఆయాతత్త్వాలకు సంబంధించినవై లిఖింపబడిన యెడల, ఆ యంత్ర సిద్ధి త్వరిత గతిని సిద్ధించును.

## స్వరాలు, వ్యంజనములకు సంబంధించిన తత్వాలు:

ఉ,ఊ,ఓ,గ,జ,ఢ,ద,బ,లు - పృధ్వీ తత్వ వర్ణాలు (అక్షరాలు)
ఔ,ఘ, ఝ, ద,ధ,భ,వ,స - జల తత్వా వర్ణాలు
ఇ,ఈ,ఐ, ఖ,చ,ద,థ,ఫ,ర - అగ్ని తత్వ వర్ణాలు
అ,ఆ,ఏ,క,చ,ట,త,ప,య,ష - వాయు తత్వ వర్ణాలు
అః,అం,డ,న్య,ణ,న,మ,శ,హ - ఆకాశ తత్వ వర్ణాలు

సిద్ధ మాతృకలు లేదా వర్ణమాల యొక్క విస్తృతిని బట్టి మంత్రరాశి నిర్మితమగును. మన పూర్వ జన పుణ్య వశంబున, మన భారతావనిలో ఎందరో మహర్షులు, కాలజ్ఞాన, భవిష్య జ్ఞాన స్వరూపులు - ముందుగానే అన్ని విషయములను గ్రహించినవారై, సర్వమానవాళి సుఖంబు నొందుటకును, సర్వబాధా విముక్తులగుటకును, మనకు అన్ని విధముల ఉపయుక్తములైన "మంత్ర-యంత్రము" లను సమకూర్చినారు. కాబట్టి ఆ మహర్షులు నిర్దేశించిన సంప్రదాయ నిబద్ధులమై, వారు చూపిన పద్ధతులు ఆచరించి సుఖంబుల బడయ వచ్చును. అదియును గాక వారు చూపిన, నిర్దేశించిన వివిధాంశములను సమగ్రముగా పరిశీలించినచో - మంత్రమునకు షష్టాంగములు గలవనియు అవిలోపించినచో సాంప్రదాయ రహితములనియు తెలియు చున్నది.

**షడాంగములు :-**

1. ఋషి - మంత్రమును కనుగొన్నవారు
2. ఛందస్సు - మంత్రమును ఎల్లకాలమందు సంరక్షించు కవచం
3. దేవత - మంత్రమునకు అధి దేవత
4. బీజము - మంత్రము యొక్క మూలాక్షరము
5. శక్తి - మంత్రమునకు ప్రతిపాదింపబడిన దివ్యబలం
6. కీలకము - మంత్రమునకు గల ప్రధాన సంధిస్థానము ఈషడంగములే గాక
7. వినియోగము - ఎందుకు మంత్రములు స్మరింపబడుచున్నది, వాని కార్యస్వరూపము.

ఇవన్నియును తెలిసి యుండవలెనని శాస్త్రవచనము లేని యెడల మంత్ర వేత్తలు ఎంత ప్రయత్నము గావించిననూ, ఆ మంత్రములు ఫలము నీయ జాలవు.

శక్తి, కీలకము, వినియోగ భేదములతో ఒకే మంత్రమును, పలువురు ఋషులు ఫలానుగ్రహ భేదములను అనుసరించి పలు విధములుగా చెప్పి యుండవచ్చును. ఈ భేదము చేతనే మంత్రము శాస్త్ర విధాయకముగా లేదనుకొనుట సరియైనది కాదు. కాని, ఛందస్సు, దేవత, బీజము మారినచో మంత్ర భేదమున్నదని గ్రహించవలెను.

పైన విచరించిన షడాంగముల వలన మనకు ఇంకను మరికొన్ని విశేషములు తెలియగలవు. అవి ఏమనగా -

1. ఋషి - మంత్రము యొక్క సాంప్రదాయము
2. ఛందస్సు - మంత్రమునందున్న అక్షరముల సంఖ్య
3. దేవత - మంత్రము యొక్క విశేషాత్మకమైన గొప్పదనము
4. బీజము - మంత్రార్గతము, నిగూఢమైన భావార్థము
5. శక్తి - మంత్ర ఉపయోగములు మరియు ప్రయోజనములు
6. కీలకము - మంత్ర ఫల ప్రాప్తికి, సిద్ధికి, కావలసిన పల్లవాదులను సంధించు స్థానమని తెలియనగును

మనకు తెలిసిన విషయములన్నియు, ఆచరణ యోగ్యములు కావలయుననిన సద్గురువును ఆశ్రయించవలసిన ఆవశ్యకత ఎంతైనా గలదు. ఏలననగా, గురువు మాత్రమే సర్వవిధములైన నిగూఢ, జటిల సమస్యలకు పరిష్కార మార్గము చూపి యదార్థ విధి విధానములను తెలియ జేయగల సమర్థులు.

## పరిపూర్ణ ఫలము - మార్గము :-

ఏదైన కార్య సాధన యందు పరిపూర్ణ ఫలితములు పొందవలెనన్న ముఖ్యముగా కావలసినవి:-

### 1. కార్యము నందు పరిపూర్ణ విశ్వాసము :-

అనగా మనము చేయబోవు కార్యము మీద సంశయ, సందేహములు ఉండరాదు. ఈ కార్యము చేయుట వలన ఫలితములు లభించును, అను పరిపూర్ణ విశ్వాసముండవలెను. అంతేకాని ఈ కార్యము చేయుచున్నాను, ఫలితము ఎమగునో, అను సంశయములు కార్యయమునకు సఫలత కలుగజేయవు.

**2. ధ్యానము :-**

అనగా ధ్యానింపబడునది. అంటే ఇక్కడ ఆ మంత్రమునకు సంబంధించిన దేవత అని అర్థము. కావున ధ్యాన సమయమందు ఏకాగ్రతతో, దేవత యొక్క దివ్య సుందర రూపమును మన మనస్సు నందు నిలుపవలెను. మనో వికారములు ఉండగూడదు.

**3. సంకల్పము :-**

ఏ కార్యమునకైనను 'సంకల్ప బలము' చాల గొప్పది. అది లేని యెడల ఏదియును సాధింప జాలము. అంతర్బాహ్య పరిణామములకు చలించక, శారీరిక, మానసిక బలముతో ఈ పనిని చేయుచున్నాను, అను ధృఢ చిత్తముతో నిశ్చయించునదియే సంకల్పము.

**4. జపము :-**

శ్లో ॥ జకారో జన్మ విచ్ఛేదః పకారో పాపనాశకః ।
జన్మ పాప వినాశిత్వాత్ జప ఇత్యభి ధీయతే ॥

"జ" అనగా జన్మ విచ్ఛేదనము చేయునది - 'ప' అనగా పాపమును నశింప చేయునది అని అర్థము. రెంటిని నశింప చేయుట చేతనే జపమని పేరు గల్గినది. నిశ్చల మనస్సుతో దైవము మీద మనస్సు కేంద్రీకరించి తత్ మంత్ర దేవతా మూర్తి యొక్క గుణ రూపములను మనస్సు నందుంచుకొని జపించవలెను. మంత్రము యొక్క భావమును పునశ్చరణ చేయుచు ఆ భావమును వివిధ పర్యాయములు దేవతా రూపము నందు ఐక్యము చేయుటయే జపము. మనో వాక్కాయ కర్మణములతో కాపాడమని దైవమును రక్షణకై శరణాగతి వేడుటవలననే పరిపూర్ణ ఫలము నివ్వగలదు. జపము అంటే మాలను వ్రేళ్లతో త్రిప్పుచు మనస్సు ఎక్కడో ఉంచి జపము చేయుట కాదు. పరిశుద్ధ భావముతో చేయవలసినది జపము. "యద్భావం తద్భవతి" అంటే మనస్సు నందు ఏ భావమును ఉంచుకోనె దమో, ఫలములు కూడా వాటి ననుసరించియే యుండునన్న ఆర్యోక్తి గుర్తుంచుకొని సద్భావన్న సత్‌చింతనలతో, ఏకాగ్ర బుద్ధితో జపము నాచరించ వలయును.

### 5. దీక్ష :-

కార్య సాధన యందు 'దీక్ష' అనునది చాలా అవశ్యకమైనది. ప్రారంభము నుండి చివరి వరకు నియమించిన, నియమ నిబంధనములను పాటించుచు, కార్యమును నిర్వహించవలయును. ఉదాహరణగా : భూశయనము, ఉపవాసము, బ్రహ్మచర్యము మొ॥ నవి దీక్ష నియమ పరిధిలోనికి వచ్చును.

ఇవ్విధముగా దీక్ష, నియమ, నిష్ఠలతో గురూపదేశము నొంది, మంత్రానుష్ఠానము చేయుటచే శ్రీఘ్రగతి కార్య సాఫల్యము చేకూరును.

## యంత్ర స్వరూపాది విశేష వివరణ

### స్వరూపము

శ్లో॥ యంత్రమ్ దేహమయమ్ ప్రోక్తమ్ తంత్రాణ్యింద్రియ సంజ్ఞకమ్ ।
మంత్రమ్ ప్రాణమితిజ్ఞేయ మిత్యే తైర్యంత్ర లక్షణమ్ ॥

యంత్రమునందు లిఖించునటువంటి వృత్తములు, వివిధములైన కోణములు, దళములు, భూపురములు - ఆ యంత్రమునకు దేహము. యంత్రము నందలి - బీజాక్షరములు, మంత్రములు ప్రాణము. ఇంద్రియాదులు యంత్రమునకు జరుపు సంస్కారములు.

స్థాపన, పూజ, ధారణా యంత్రములుగా మూడు విధములై ఒప్పు చున్నవి. యంత్రమును 5 అంగుళముల సమ చతురస్రపు రేకుపైన లిఖించాలి. యంత్రములను సాధారణముగా బంగారు, వెండి, రాగి లోహములపై లిఖించుచుందురు. యంత్రలోహము బంగారమైన ఉత్తమ ఫలితములను, వెండియైన మధ్యమ ఫలితములు, రాగియైన సాధారణ ఫలితముల నొసంగగలవని శాస్త్ర వచనము. రాతి మీద చెక్కించిన యంత్రములకు ఆశించిన ఫలితములు కానరావనియు ప్రమాణము గలదు. కాని పూజ, స్థాపన, ధారణాదులలో కొన్ని విధములైన అంతరములు కానుపించుచున్నవి.

ధారణా యంత్రములు - బంగార రేకు మీద పూజాది యంత్రములు వెండి రేకు మీద, స్థాపన కొరకు రాగి రేకుపై విభించ వలయును అనువచనము

ప్రశస్తముగా తెలుపబడినది. అదియును గాక - నివాసస్థలము లందుచు యంత్రములు బంగారు రేకు నందు, సభాస్థలస్థాపనకు వెండి రేకు నందు. దేవాలయమునందు స్థాపన కొరకై శిలాయంత్రములు విశిష్ట ఫలదాయకములు. రాగియంత్రములు గృహ, సభాదులందెచ్చటైనను ఫల ప్రదాయినులై ఉండగలవు.

**అంగములు** : యంత్రము దేహము వంటిదని గదా ముందు తెలియ చెప్పినాము. మరి దేహము అన్న పిదప సర్వాంగములు క్రమముగా ఉంటేనే దేహము సర్వ శక్తి సమన్వితము. ఏ అంగము లోపించినను - అంగ విహీనతేకదా - కనుక యంత్రములకు కూడా అంగములను శాస్త్రములందు నియమించినారు. వీటిలో ఏ ఒక్క అంగమునకైనా లోపము కల్గిన ఆ యంత్రము ఫల శూన్యము అగును.

యంత్ర నిర్మాణమునకు ముఖ్యముగా ఉండవలసినవి 20 అంగములు. ఇవి వరుసగా - జీవము, ప్రాణము, జీవ మంత్రము, ఆత్మ మంత్రము ,శక్తి, చక్షువులు, శ్రోత్రములు, జిహ్వా, కర్త, కర్మ, క్రియ మంత్రగాయత్రి, యంత్రగాయత్రి, ప్రాణ ప్రతిష్ఠా మంత్రము, సూర్య బీజము, రక్షా వర్ణము, మాతృకా వర్ణములు, పంచ భూత బీజములు, దిక్పాలక బీజములు, మాయా, పాశ, అంకుశ బీజములు వీటితో మూల మంత్రము కలసి ఇరువది ఒక్క అంగములు అగుచున్నవి.

అంగముల రహస్య భావం బీజములు - కొన్ని గ్రంథములందు ఈ క్రింది విధముగా తెలుపుచున్నవి.

1. మహా బిందువు లేదా బిందువు - ఇది మూల భావము మరియు జీవము
2. కోణములు - ప్రాణం
3. జీవమంత్రం - బిందువు నందలి బీజములు
4. ప్రాణ మంత్రము - ఆవరించియున్న కోణములందలి బీజములు
5. శక్తి బీజములు - "ఐం," "హ్రీం," " శ్రీం"
6. దక్షిణ, వామ నేత్ర బీజములు "ఇం", "ఈం"
7. ఉభయశ్రోత్ర బీజములు - " ఉం, ఊం"
8. ముఖ బీజములు - " అం, ఆం" అనునవి

9. హస్త బీజములు - "యం, యాం"
10. రక్షా బీజములు - "క్షాం, స్రాం"
11. పాశాంకుశబీజములు - " ఆం, హ్రీం, క్రోం"
12. పంచభూతబీజములు - " హం, యం, రం, వం,లం"
13. జీవాత్మ బీజములు - " ఆం, హం, సంః"
14. పరమాత్మ బీజములు - " హంసస్సో హం"
15. అష్టదిక్పాలక బీజములు - "లం,రం,హం,షం,వం,యం,సం,శం"
16. తేజోమంత్రము :- "ఓం అసునీతే పునరస్మా సు చక్షుః పునః ప్రాణ మిహినో దేహి భోగమ్ జోక్పశ్యేమసూర్య ముచ్చ రన్త మనుమతే మృడయాన స్వస్తి"
17. ప్రాణ మంత్రము - "అమృతమ్ వైప్రాణా అమృత మాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే
18. హస్త బీజములు - " లుం, లూం"
19. పాదబీజములు - "యాం. స్రాం"
20. ఆధారబీజములు - "యాం, క్షాం"
21. రక్షా మంత్రము - "సహస్రార హుంఫట్ స్వాహా"

ఈ విధముగా తెలుసుకుని యంత్ర రచనకు పూనుకొనవలెను. అదియును గాక గురు సాంప్రదాయముల ననుసరించి ఆగమ శాస్త్ర ప్రమాణములతో యంత్ర నిర్మాణము గావింపవలెను. మరి ఈ విధంగా తయారు చేయబడిన యంత్రములు వెంటనే ఉపయోగించ వీలులేదు. ఎందుకనగా యంత్రము లిఖించిన పిమ్మట శాస్త్రరీత్యా కొన్ని సంస్కారములు జరుప వలసియున్నది. సంస్కారము జరుపబడని యంత్రములు, ఫలములనీయజాలవు.

## యంత్ర సంస్కారవివరణ :-

శ్లో ॥ ప్రారంభేత్యధివాసమ్ చ స్నానమ్ పంచామృతై స్తథా ।
అగ్న్యుత్తరణ సంస్కారమ్ కుర్యాన్మారన కర్మణి ॥
ఓషధీ స్నాన స్నపన మలంకార మతః పరమ్ ।
మూర్తి న్యానమ్ తథాప్రోక్తమ్ మంత్ర న్యాస మతః పరమ్ ॥

ప్రతిష్ఠా ప్రాణ మంత్రేణ కళాన్యాసా భిరే వచ ।
బంధనే కుశ గ్రంధిమ్ చ పూజా హోమ మతః పరమ్ ॥
త్రయో దశంతు విజ్ఞేయమ్ యంత్ర సంస్కార మర్హసి ।
సర్వ యంత్రోప యోగార్థమ్ సంస్కారై ర్కురు యత్నతః ॥

ఈ శ్లోకము ననుసరించి - యంత్రము లిఖింపబడిన పిదప - అధివాస మొనర్పవలెను. 1. గమ్యాధి వాసము 2. జలాధివాసము 3. ధాన్యాధివాసము అను మూడును ముఖ్యమైనవి. అధివాసమనగా యంత్రమును మంత్ర పూతముగా "పంచగవ్యముల" యందు ఒక దినమంతయు ఉంచుట, పిదప పంచామృతములతో అభిషేకించి, లోహ దోషములను, తదితర దోషముల నివృత్తికై "అగ్న్యుత్తరణము" జరుపవలెను. మరల మార్జన మంత్రముతో, మార్జనగావించి, ఓషధీ ద్రవ్యయుక్త జలముతో అభిషేకించి, పసుపు, కుంకుమాదులచే అలంకరించి, మూర్తిన్యాస, మంత్రన్యాస, ప్రాణప్రతిష్ఠ, కళా న్యాసములను జరిపించిన పిమ్మట దర్భలచే బంధించి షోడశోపచార పూజ జరుపుట అనునవి యంత్ర సంస్కారములుగా నెఱుంగవలయును.

అటు పిమ్మట దీక్ష, నియమములతో విధించిన ప్రమాణములో జపాదులనాచరించిన ఏ యంత్రమైనను - సంకల్పిత శుభములను శీఘ్రగతిని ప్రసాదించుననుటలో ఎంత మాత్రము సందేహము లేదు. అట్లు జరగనిచో అది మానవ నిర్వహణ లోపముగానే భావించవలసి యుండును.

(యంత్రమును నిర్మించిన పిదప - ఒక సత్పాత్రుడైన వైదిక బ్రాహ్మణుని ద్వారా ప్రాణా ప్రతిష్ఠ జరిపించి, షోడశోప చోర పూజలు నియమిత దినములు ఆచరించివలయును.)



# యంత్ర సంస్కార - ప్రాణ ప్రతిష్ఠాది విధానము

## సంకల్పము చేయు విధానము :

" ఆచమ్యః ఓం కేశవాయ స్వాహా । ఓం నారాయణ స్వాహా । ఓం మాధవాయ స్వాహా ।" (అని ఈ మూడు నామములు చెప్పచూ జలమును లోపలకు స్వీకరించిన పిమ్మట, మిగలిన నామములను ధ్యానముద్రలో ఉచ్ఛరించవలెను)

"ఓం గోవిందాయనమః । ఓం విష్ణవేనమః । ఓమ్ మధుసూదనాయ నమః ।
ఓం త్రివిక్రమాయ నమః । ఓం వామనాయ నమః । ఓం శ్రీధరాయనమః ।
ఓం హృషీకేశాయనమః । ఓం పద్మనాభాయ నమః ।
ఓం దామోదరాయనమః । ఓం సంకర్షణాయ నమః ।
ఓం వాసు దేవాయనమః । ఓం ప్రద్యుమ్నాయ నమః ।
ఓం అనిరుద్ధాయ నమః । ఓం పురుషోత్తమాయ నమః ।
ఓం అధోక్షజాయ నమః । ఓం నారసింహాయనమః ।
ఓం అచ్యుతాయ నమః । ఓం జనార్ధనాయనమః । ఓం ఉపేంద్రాయనమః ।
ఓం హరయేనమః । ఓం శ్రీ కృష్ణాయనమః ।

★ (ఈ క్రింది మంత్రమునుచ్చరించుచు - జలము, అక్షతలను చేతితో నలు దిక్కులా చల్లవలెను)

**మంత్రము :** ఉత్తిష్ఠంతు భూత పిశాచాః । ఏతే భూమి భారకా । ఏతేషా మవి రోధేన బ్రహ్మ కర్మ సమారభే ।

★ (ఈ క్రింది మంత్రములచే ప్రాణాయామముగావించవలెను)

**మంత్రము :** దేవీ గాయత్రీ ఛందః । ప్రాణాయామ వినియోగః

"ఓం భూః ఓం భువః ఓగ్మ్ సువః ఓమ్ మహః ఓం జనః
ఓం తపః ఓగ్మ్ సత్యమ్ । ఓం తత్సవితుర్వ రేణ్యమ్ ।
భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ ।
ఓ మాపో జ్యోతిరసో మృతమ్ బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥"

★ తర్వాత ఈ క్రింది విధముగా చెప్పవలెను

"మమ, ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిస్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహా విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రాహ్మణః । ద్వితీయ పరార్థే । శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వంతరే । కలియుగే । ప్రథమ పాదే । జంబూద్వీపే । భరత వర్షే భరత ఖండే । మేరోర్దక్షిణ దిగ్భాగే । శ్రీశైలస్య ఈశాన్య . . . . . . ప్రదేశే । కృష్ణా కావేర్యో (గోదావర్యో) ర్మధ్య ప్రదేశే । శోభనగృహే । సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ। అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన . . . . . . . నామ సంవత్సరే . . . . . . . . ఆయనే . . . . . . . . ఋతౌ . . . . . . . . . . మాసే . . . . . . పక్షే . . . . . . . . . తిథౌ . . . . . . . . . వాసరే । శుభ నక్షత్ర శుభ యోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయామ్ । శుభ ముహూర్తే శ్రీమాన్ . . . . . . గోత్రోద్భవస్య . . . . . . . నామధేయస్య శ్రీమతః . . . . . . . . . గోత్రస్య . . . . . . . నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య సహ కుటుంబానామ్ ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ, సిద్ధ్యర్థమ్, మమ స్వగృహే గృహస్థిత మేదిన్యామ్ దృశ్యా దృశ్య సమస్త వాస్తు దోష నివారణార్థమ్ । నిర్మాణ సమయే ఆపాదిత ముహూర్త దోష, నిర్మాణదోష, సూతక దోష, దుష్ట గ్రహ ఆవాహిత దోష సమస్త దృష్టి దోషాది, చండాల ప్రవేశ దోష, కుక్కుట, శూన గార్ధభాది ప్రవేశ దోష, నానా విధాని దోష పరిహారార్థమ్ । జన్మ లగ్న వశాన్, నామ నక్షత్ర, జన్మనక్షత్ర వశాన్, ఏఏ గ్రహ దుష్ట స్థానేషు స్థితాః తేషామ్ గ్రహాణామ్ తత్తద్దుష్ట స్థానం పరిత్యజ్యా శుభ స్థానస్థిత శుభ ఫలావాప్త్యర్థతి, సంవత్సర, ఆయన, ఋతు, మాస, పక్ష, తిథ్యహో రాత్రాదిషు మమ సహ కుటుంబేన సకల కల్యాణ శుభఫల పరం పరాభివృద్ధ్యర్థమ్। సర్వాపదాన్ శాన్తి పూర్వక దీర్ఘాయురారోగ్య, ధనధాన్య అఖండైశ్వర్య, స్థిర లక్ష్మీ కీర్తి ప్రతిష్ఠాది అత్యున్నత జీవన యోగ ప్రాప్త్యర్థమ్ । సర్వ శత్రు వినాశనార్థం, సర్వాపన్ని వారణార్థమ్, అపమృత్యు దోష నివారణార్థమ్" అముక" యంత్ర దేవతా ప్రతిష్ఠాపనే అస్య యంత్ర దేవస్య యథావిధిన్ సంస్కార పూర్వక ప్రాణ ప్రతిష్ఠాది విధివత్కార్యం కరిష్యే ॥ (అని ఉదకమును ఉంగరపు వేలితో త్రాకవలెను.)

**ముఖ్య గమనిక :** ఇక ముందు జరుపవలసిన విధి విధానములందు ఉపయోగించినవి "వేద మంత్రములు " కావున తప్పక వేద విదులు లేక

సద్గురువులచే ముఖతః నేర్చుకొని మంత్రములను "సస్వరముగా" ఉచ్ఛరించవలయును. మరియు "అముక" ఉన్నచోట సంబంధిత యంత్రము యొక్క పేరు చెప్పవలయును.

## 1. అధివాసము - మంత్రము

**పంచగవ్యాధి వాసము :** ఓం యజ్ఞాయజ్ఞావః సమనాతు తుర్వణిర్ధియంతో దేవయా ఉదధిః ఆవోర్వాచః సువితాయ రోదస్మోర్య హేవ వృత్యామసే సువృక్తిభిః సోమమ్ రాజా న మనసేగ్నిమ్ గీర్భిర్హ్ వామహే ఆదిత్యా న్విష్ణుమ్ సూర్యమ్ బ్రహ్మణామ్ చ బృహస్పతిమ్ ॥

**జలాధివాసము :** ఓమ్ అపోవా ఇదగ్ మ్ సర్వమ్ విశ్వా భూతాన్యా పః ప్రాణావా ఆపః పశవ ఆప్కోన్నమాపో మృత మా పస్స్రమ్రా డా పోస్సర్వాడా పస్సత్యమా పస్సర్వా దేవతా ఆపో భూర్భువ స్సువరా ప ఓమ్ ॥

**ధాన్యాధివాసము :** ఓమ్ ఊర్క్యమే సూనృతా చ మే పయశ్చ మే రసశ్చ మేఘృతం చమే మధు చమే సగ్ధిశ్చ మే సపీతిశ్చమే వృష్టిశ్చ మే కృష్టిశ్చ మే జైత్రమ్ చ మే ఔద్భిద్యమ్ చమే రయిశ్చ మే రాయశ్చమే పుష్టమ్ చమే పుష్టిశ్చమే విభు చ॥

**అధివాస త్రయము :** ఓమ్ శయ్ చమే మయశ్చ మే ప్రియం చమే ను కామశ్చ మే కామేశ్చ మే సౌ మనసశ్చ మే భద్రమ్ చమే శ్రేయశ్చ మే వస్యశ్చ మే యశశ్చమే భగశ్చ మే ద్రవిణమ్ చమే యంతా చమే ధర్తా చమే క్షేమశ్చ మే ధృతిశ్చ మే విశ్వమ్ చ॥

## ౨. పంచామృత స్నానము - మంత్రము

(ఈ క్రింది మంత్రములతో, ఆయా పదార్థములతో స్నానము గావించవలెను.)

**ఆవుపాలు :-** ఓమ్ ఆప్యాయ స్వసమేతు తే విశ్వత స్సోమ వృష్ణియమ్ భవా వాజస్య సంగధే॥

**ఆవు పెరుగు :-** ఓమ్ దధిక్రావణ్ణో అకారిషమ్ జిష్ణో రశ్వస్య వాజినః సురభినో ముఖా కరత్ప్రణ అయూగ్ మ్షి తారిషత్ ॥

**ఆవు నెయ్యి :-** ఓమ్ శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవ స్సవితో త్పునా త్వ చ్ఛిద్రేణ వసో స్సూర్యస్య రశ్మిభిః

**తేనె :-** ఓమ్ మధువాతా ఋతాయ తే మధు క్షరంతి సింధవః మాధ్వీర్న సంతోషధీః మధు నక్త ముతోషసి స్తున పితా మధుమాన్నో వనస్పతి ర్మధు మాగ్మ్ అస్తు సూర్యః మా ద్వీర్గావో భవంతునః

**శర్కర (చక్కెర) :-** ఓమ్ స్వాదుః పవస్య దివ్యాయ జన్మనే స్వాదు రింద్రాయ సహవేతు నావేన్న సాదుర్మిత్రాయ వరుణాయ వాయువే బృహస్పతయే మాధు మాగ్మ్ అదాభ్యః ॥

**ఫలోదకము :-** ఓమ్ యాః ఫలినీర్యా అఫలా పుష్పాయాశ్చ పుష్పిణీః ॥ బృహస్పతి ప్రసూతా స్థానో ముంచన్త్వగ్మ్ హసః ॥

**శుద్ధోదకము :-** ఓమ్ ఆపోహిష్ఠామ యో భువః తాన ఊర్జే దధాతన మహేరణాయ చక్షసే యో వశ్శివ తమో రసః తస్యభాజయ తేహనః ఉశతీరివ మాతరః తస్మాదరంగ మామవః ఓం యస్యక్షయాయ జిన్వధ ఆపో జనయథాచనః ॥

## 3. అగ్న్యుత్తరణము - మంత్రము

★ (ఈ క్రింది తెలిపిన రెండు మంత్రములను కలిపి మూడు పర్యాయములు చదువుచూ జలమును ఏకధారగా యంత్రము మీద అభిషేకించవలెను.)

(అ) ఓమ్ అశ్వ క్రాన్తే రథ క్రాన్తే విష్ణు క్రాన్తే వసుంధరా శిరసా ధారయిష్యామి రక్షస్వమామ్ పదేపదే ॥

(ఆ) ఓం కాండా త్కాండా త్ప్రరోహన్తీ పరుషః పరుష ః పరి ఏవానో దూర్వే ప్రదను సహస్రేణ శతే నచ॥

★ (మరల ఈ క్రింది మంత్రోచ్ఛారణతో యంత్రముపై ఉదకమును చల్లుచు అగ్న్యుత్తరణమును గావించవలెను)

(ఇ) "అగ్ని సూక్తము" ను పఠించవలెను.

(ఈ) ఓమ్ హిరణ్య వర్ణా శ్శుచయః పావకాః యా సుజాతః కశ్యపో యా స్వింద్రః అగ్నిమ్ యాగర్భమ్ దధిరే విరూపా స్థాన ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు"

(ఉ) ఓమ్ యా సాగ్‌మ్ రాజా వరుణోయాతి మధ్యే సత్యానృతే అవపశ్యమ్ జనానామ్ మధుశ్చుత శ్శుచయో యాః పావకా ... స్థాన ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు ॥

(ఊ) ఓమ్ యా సామ్ దేవా దివి కృణ్వంతి భక్షయామ్ అన్తరిక్షే బహుధా భవంతి యాః పృధివీమ్ పయసోమ్ దంతి శుక్రా ... స్థాన ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు॥

(ఋ) ఓమ్ శివే నమా చక్షుషా పశ్యతా ... పశ్చివయా తనువోప స్పృశత త్వచమ్ మే సర్వాగ్‌మ్ అగ్నీగ్‌మ్ రప్సుషదో హువేవో వయివర్చో బలమోజో నిధత్త ॥

(ౠ) ఓమ్ సువర్ణమ్ ఘర్మమ్ పరివేద వేనమ్ ఇంద్ర ... స్వాత్మానమ్ దశ... థా చ రన్తమ్ అన్త స్సముద్రే మనసా చరన్తమ్ బ్రహాన్వ విన్ద ద్దశ హోతార వర్ణే అంతః ప్రవిష్ట శాస్తా జనానామ్ ఏక సశ్చ హుధా విచారః శతగ్‌మ్ శుక్రాణి యత్రైకమ్ భవన్తి సర్వేవేదా యత్రైకమ్ భవన్తి సర్వేపోతారో యత్రైకమ్ భవన్తి సమానసీన ఆత్మ జనానామ్.

## 4. మార్జన మంత్రములు

★ (ఈ క్రింది మంత్రములచే - యంత్రమును శుద్ధోదకముతో మార్జన గావింపవలెను.)

1. ఓమ్ పవమాన స్సువర్జనః పవిత్రేణ విచక్షణిః
   యః పోతా . . . . . . . . . . . . . పునన్తు విశ్వ . . . . . . . . ఆయపః . . . ....
2. ఓమ్ హిరణ్య శృంగమ్ వరుణమ్ ప్రపద్యే . . . . . . . . సువాన ఇన్దుః ॥
3. ఓమ్ అగ్ని మీళే పురోహితమ్ యజ్ఞస్య దేవ మృత్విజమ్ హోతారమ్ విశ్వ వేదనమ్ ॥
4. ఓమ్ అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్య దాతయే నిహోతా త్సత్సి బర్హిషి।

5. ఓమ్ శన్నో్దేవి రిభిష్టయ ఆపో భవన్తు పీతయే శం యో రభిస్రవమ్ తునః॥

6. ఓమ్ ఆపో హిష్ఠామ యో భువః ....................... ఆపోజన యథా చన॥

7. ఓం సహస్ర శీర్షా పురుషః ....................... సర్వమ్ మనిషాణ

8. ఓమ్ హిరణ్య వర్ణామ్ హరిణీ .................. విన్దేయ పురుషా నహమ్॥

## 5. ఓషధీస్నానము - మంత్రములు

★ (ఈ క్రియకు ఉపయోగించు ఓషధులు :- మోదుగ, రావి, మేడి, మఱ్ఱి, జువ్వి, మామిడి, మారేడు, కదమ్బ, అశోక, ఆరె, చంపక - ఈ 11 ఓషధుల యొక్క - వేరు, పట్ట, పువ్వు, కాయ, లేత చిగుళ్లు వీటిని నీటిలో కలుపవలెను. పిదప ఈ క్రింది ఎనిమిది మంత్రములను చదువుతూ యంత్రమును ఈ ఓషధీ జలముతో స్నానము గావించవలయును.)

1. ఓమ్ ఇదమాపః ప్రవహత యత్కిమ్ చ దురితమ్ మయి యద్వాహ మభిద్రుద్రోహ యద్వాశేవ ఉదానృతమ్ ॥

2. ఓమ్ ఆపో అద్యాన్వ చారిషమ్ రసేన సమ గస్మహి పయస్వా నగ్న ఆగహితమ్ మాసమ్ సృజ వర్చసా ॥

3. ఓమ్ సస్రుషీ స్తదపసో దివా నక్తమ్ చ సస్రుషీమ్ వరేణ్య క్రతూ రహమా దేవీ రవసే హువే॥

4. ఓమ్ చిత్సఖాయమ్ సఖ్యావ వృత్యామ్ తిరః పురూచి దర్ణవమ్ జగన్వాన్ పితుర్నపాత మా దధీత వేదా అధిక్షమీ ప్రతరమ్ దీ ధ్యానః ॥

5. ఓం నతే సఖాసఖ్యమ్ వృష్ట్యే త త్సలక్ష్మా యద్విషు రూపా బవాతి మహ స్పుత్రాసో అసురస్య వీరా దివోధర్తార ఉర్వియా పరిఖ్యన్ ॥

6. ఓమ్ ఉంశతి ఘాతే అమృతా స ఏత దే కస్య చిత్తజసమ్ మర్త్య స్వనితే మనో మనసి ధాయన్మే జన్యుః పత్తిన్త న్వా... మావి విశ్వాః

7. ఓం నయత్పురా చకృమా కద్ధమా నమృతా వదమ్‌తో అనృతమ్ రపేమ గంధర్వో అప్స్వప్యాచ యోషా సానో నాభిః పరమమ్ జామి తన్నౌ॥

8. ఓం గర్భే మనో జనితా దంపతీ కర్దేవ స్త్వష్టా సవితా విశ్వరూపాః నకిరస్య ప్రమినంతి వ్రతాని వేదనా వస్య పృదివీ ఉతద్యోః ॥

# ౬. స్నాపన - మంత్రములు

★ (పంచపల్లవములు, అష్టగంధములు కలిపిన జలముతో, ఈ క్రింది మంత్ర పఠనము జేయుచూ, యంత్రమునకు స్నపన గావించవలెను.)

"**అష్ట గంధములు** :- చందనము, కుంకుమ పువ్వు, పచ్చకర్పూరము, అగరు, చంగల్వకోష్ఠు, జలుమాంసి, తక్కోలములు, వట్టివేళ్ళు.

**పంచపల్లవములు** :- రావి, మేడి, జువ్వి, మఱ్ఱి, మామిడి - ఈ చెట్ల యొక్క లేత చిగురులు."

## మంత్రములు

★ ఓమ్ ఉద్గాతే వ శకునే సామ గాయసి బ్రహ్మ పుత్ర ఇవ సవనేషు శంససి వృషేవ వాజీ శిశుమతీ రపీచ్యా సర్వతో న శ్శకునే భద్రమావద విశ్వతో న శ్శకునే పుణ్యామా వద"

★ ఓం గంధ ద్వారామ్ దురాదర్షామ్ నిత్య పుష్టామ్ కరీషిణీమ్ ఈశ్వరీగ్‌మ్ సర్వ భూతానామ్ తామి హోపహ్వాయే శ్రియమ్ "

★ ఓమ్ అగ్ని ర్మే వా చి శ్రితః వాగ్ హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి॥

★ ఓమ్ వాయు ర్మే పాణే శ్రితః ప్రాణో హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి ॥

★ ఓమ్ సూర్యో మే చక్షు శ్రితః కుక్షుర్హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి॥

★ ఓమ్ చంద్రమా మే మనసి శ్రితః మనో హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి॥

★ ఓమ్ దిశోమే శ్రోత్రే శ్రితాః శ్రోత్రాగ్‌మ్ హృదయే - హృదయమ్ మయి అహ మన్నుతే అమృతమ్ బ్రహ్మణి॥

★ ఓం ఆపో మే రేతసి శ్రితాః రేతో హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి॥

★ ఓం పృథివీ మే శరీరే శ్రితాః శరీరమ్గ్ హృదయే హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి ॥

★ ఓమ్ ఓషధి వనస్పతయో మే లోమసు శ్రితాః లోమాని హృదయే హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి॥

★ ఓమ్ ఇంద్రో మే బలే శ్రితః బలగ్మ్ హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి ॥

★ ఓమ్ పర్జన్యో మే మూర్ధ్ని శ్రితః మూర్ధా హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి ॥

★ ఓమ్ ఈశానో మే మన్యౌ శ్రితః మన్యుర్హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి ॥

★ ఓమ్ ఆత్మను ఆత్మని శ్రితః ఆత్మా హృదయే - హృదయమ్ మయి అహ మమృతే అమృతమ్ బ్రహ్మణి ॥

★ ఓం పునర్మ ఆత్మా పునరాయుగాత్ పునః ప్రాణః పునరా...కూత మాగాత్ వైశ్వానరో రశ్మిభిర్వా పృథానః అంతస్తిష్ఠ త్వ...మృతస్యగోపాః ॥

## 7. అలంకారము - మంత్రములు

★ (ఈ క్రింది మంత్రములనుచ్ఛరించుచూ - ఆయా ద్రవ్యములతో యంత్రమునలంకరింపవలెను.)

**పసుపు :-** ఓం గౌరీ మిమాయ సలిలాని తక్ష త్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ అష్టాపదీ నవపదీ బభూవషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥

**శ్రీ గంధము :-** ఓం గంధ ద్వారామ్ దురాధర్షామ్ నిత్య పుష్టామ్ కరీషిణీమ్ ఈశ్వరీగ్మ్ సర్వ భూతానామ్ తా మిహోపహ్వయే శ్రియమ్ ॥

**కస్తూరి :-** ఓమ్ కర్దమేన ప్రజాభూతా మయిసంభవ కర్దమ శ్రియమ్ వాసయమే కులే మాతరమ్ పద్మ మాలినీమ్"

**సిందూరము :-** ఓమ్ తా మగ్నివర్ణామ్ తపసా జ్వలంతీమ్ వైరోచనీమ్ కర్మఫలే జుష్టామ్ దుర్గామ్ దేవీగ్మ్ శరణ మహమ్ ప్రపద్యే సుతర సితర సేనమః॥

**అక్షతలు** :- ఓమ్ ఆయనే తే పరాయణే దూర్వారో హన్తు పుష్పిణీః హ్రదాశ్చ పుండరీకాణి సముద్రశ్చ గృహోయిమే ॥

**కుంకుమ** :- ఓమ్ మయిమేథామ్ మయిప్రజామ్ మయీంద్రియమ్ వీర్యమ్॥

**పుష్పమాల (పువ్వులు)**:- ఓమ్ యోపామ్ పుష్పమ్ వేద పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి చంద్రమా వా అపామ్ పుష్పమ్ పుష్పవా న్ప్రజావా న్పశుమాన్ భవతి ॥

ఓమ్ యంత్ర రాజాయ విద్మహే । మహా యంత్రాయ ధీమహి । తన్నో యంత్రః ప్రచోదాయాత్

# 8. మూర్తి న్యాసము

★ (ఈ క్రింది మంత్రములను పఠించుచు - యంత్రావయవ స్థానములందు అక్షతలను ఉంచవలయును)

**ప్రణవన్యాసము :**

ఓం అం అకారాయ నమః పాదయోః
ఓం ఉం ఉకారాయ నమః హృదయే
ఓం మం మకారాయ నమః లలాటే
ఓం ఓం ప్రణవ బ్రహ్మణే నమః సర్వాంగేషు ॥
ఓం అం కేశవాయ నమః ఓం ఆం సంకర్షణ రూపిణే నమః శిరశి
ఓం ఇం నారాయణాయ నమః ఓం ఈం వాసు దేవ స్వరూపిణే నమః ముఖే
ఓం ఉం మాధవాయ నమః ఓం ఊం ప్రద్యుమ్న స్వరూపిణే నమః గ్రీవాయామ్ ॥

**వ్యాహృతీ న్యాసము :**

ఓం భూః అగ్నయేనమః పాదయోః
ఓం భువః వాయవే నమః హృదయే
ఓం సువః సూర్యాయనమః లలాటే
ఓం భూర్భువ స్సువః బ్రహ్మణే నమః సర్వాంగేషు
ఓం ఋం గోవిందాయ నమః ఓం ౠం అనిరుద్ధ స్వరూపిణే నమః
- బాహూ భ్యామ్

ఓం లుం విష్ణవేనమః ఓం లూం పురుషోత్తమ స్వరూపిణే నమః
- హృదయే

ఓం ఏం మధుసూదనాయ నమః ఓం ఐం అధోక్షజ స్వరూపిణే నమః
- పృష్ఠే

**మూర్తి న్యాసము:**

ఓం శ్రీం మత్స్యాయ నమః మూర్ధ్ని
ఓం ఐం కూర్మాయ నమః పాదయోః
ఓం క్ష్రాం నృసింహాయ నమః లలాటే
ఓం గ్లౌం వరాహాయ నమః జంఘయోః
ఓం లం వామనాయ నమః ముఖే
ఓం క్రోం భార్గవాయ నమః హృదయే
ఓం రాం రామాయ నమః బాహుద్వయౌ
ఓం క్లీం శ్రీకృష్ణాయ నమః నాభౌ
ఓం జం బుద్ధాయ నమః బుద్ధౌ
ఓం హ్రీం కల్కినే నమః జానుద్వయే
ఓం ఓం త్రివిక్రమాయనమః ఓం ఔం నారసింహస్వరూపిణే నమః
- కట్యామ్

ఓం అం వామనాయ నమః ఓం అః అచ్యుతస్వరూపిణే నమః - జఠరౌ
ఓం అం ఆం శ్రీధరాయనమః ఓం ఇం ఈం జనార్దన స్వరూపిణే నమః
- దక్ష జంఘాయామ్

ఓం ఉం ఊం హృషీకేశాయనమః ఓం ఋం ౠం ఉపేంద్ర స్వరూపిణే నమః
- వామ జంఘాయామ్

ఓం ఓం ఔం పద్మనాభాయ నమః ఓం ఏం ఐం హరిస్వరూపిణే నమః
గుల్ఫయోః

ఓం ఓం ఔం దామోదరాయనమః ఓం అం అః శ్రీ కృష్ణ స్వరూపిణే
నమః పాదయోః ॥

**మాతృకాన్యాసము :**

ఓం అం నమః తాలుకే। ఓం ఆం నమః ముఖే।
ఓం ఇం నమః దక్షిణ నేత్రే। ఓం ఈం నమః వామనేత్రే।
ఓం ఉం నమః దక్షిణ శ్రోత్రే। ఓం ఊం నమః వాయశ్రోత్రే।

ఓం బుం నమః దక్షిణ గండే । ఓం బూం నమః వామ గండే ।
ఓం లుం నమః దక్షిణ నాసాపుటే । ఓం లూం నమః వామనాసాపుటే ।
ఓం ఏం నమః ఊర్ధ్వదంత పంక్తౌ । ఓం ఐం నమః ఆధోదంత పంక్తౌ ।
ఓం ఓం నమః ఓష్ఠే ।
ఓం ఔం నమః అధరౌ । ఓం అం నమః లలాటే ।
ఓం అః నమః జిహ్వాయామ్ । ఓం యం నమః త్వచి ।
ఓం రం నమః చక్షుషోః । ఓం లం నమః నాసికాయాం ।
ఓం వం నమః దశనేషు । ఓం శం నమః శ్రోత్రయోః ।
ఓం షం నమః ఉదరే । ఓం సం నమః కటిదేశే ।
ఓం హం నమః హృదయే । ఓం ళం నమః లింగే ।
ఓం క్షం నమః నాభ్యాం ।
ఓం పం ఫం బం భం మం దక్షబాహౌ ।
ఓం తం థం దం ధం నం వామబాహౌ ।
ఓం టం ఠం డం ఢం ణం దక్ష జంఘాయామ్ ।
ఓం చం ఛం జం ఝం ఞం వామ జంఘాయామ్ ।
ఓం కం ఖం గం ఘం ఙం సర్వాంగుళీషు ।
ఓం అం కం చం టం తం పం యం శం నమః సర్వాంగేషు
ఇతి మంత్రౌ త్రివారమ్ యంత్రమ్ పూజయిత్వా ॥

## 8. మంత్ర న్యాసము

★ (ఈ క్రింది మంత్రములను పఠించుచూ, యంత్రమందలి ఆయా స్థానములను కుశము (దర్భ) లతో తాకుచుండ వలయును.)

**భూతన్యాసము :**

ఓం లం హ్రాం పృథ్వీ తత్త్వాయ నమః
ఓం వం హ్రాం అపః తత్త్వాయ నమః
ఓం రం హ్రాం తేజో తత్త్వాయ నమః
ఓం యం హ్రాం వాయు తత్త్వాయ నమః
ఓం హం హ్రాం ఆకాశ తత్త్వాయ నమః

## జంఘ స్థానము నందు

ఓం ఐం హ్రీం శ్రీం గంధ తన్మాత్రాయ ఓం గంధాక్షాయనమః
ఓం ఐం హ్రీం శ్రీం రస తన్మాత్రాయ ఓం జలదాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం రూప తన్మాత్రాయ ఓం భానుమతే నమః
ఓం ఐం హ్రీం శ్రీం స్పర్శ తన్మాత్రాయ ఓం బలాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం శబ్ద తన్మాత్రాయ ఓం సూక్ష్మనాదాయ నమః

## కటి ప్రదేశము నందు

ఓం ఐం హ్రీం శ్రీం వాక్ తత్త్వాయ ఓం దుందభయే నమః
ఓం ఐం హ్రీం శ్రీం పాణి తత్త్వాయ ఓం సమాదానాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం పాద తత్త్వాయ ఓం సంక్రమాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం పాయు తత్త్వాయ ఓం విసర్గాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఉపస్థ తత్త్వాయ ఓం ఆనందాయ నమః

## నాభి స్థానము నందు

ఓం ఐం హ్రీం శ్రీం శ్రోత్ర తత్త్వాయ ఓం వ్యోమాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం త్వక్ తత్త్వాయ ఓం సర్వాంగాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం చక్షుస్ తత్త్వాయ ఓం ఆకాశాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం రస తత్త్వాయ ఓం మహో వక్త్రాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఘ్రాణ తత్త్వాయ ఓం విలుంఠాయ నమః

## కంఠము నందు

ఓం ఐం హ్రీం శ్రీం మనస్తత్త్వాయ ఓం సంకల్పాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం బుద్ధి తత్త్వాయ ఓం బుద్దయే నమః
ఓం ఐం హ్రీం శ్రీం అహంకార తత్త్వాయ ఓం అహంకృతే నమః
ఓం ఐం హ్రీం శ్రీం చిత్త తత్త్వాయ ఓం మనసే నమః

## భూపురముల యందు (తూర్పు నుండి)

ఓం ఐం హ్రీం శ్రీం పూర్వ ద్వారే ఓం ఋగ్వేదాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం దక్షిణ ద్వారే ఓం యజుర్వేదాయ నమః

ఓం ఐం హ్రీం శ్రీం పశ్చిమ ద్వారే ఓం సామ వేదాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఉత్తర ద్వారే ఓం అధర్వణ వేదాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం సర్వద్వార మధ్యేషు ఓం పితామహాయ నమః

## యంత్ర మధ్య స్థానము నందు

ఓం ఐం హ్రీం శ్రీం పురుష తత్త్వాయ ఓం విష్ణవే నమః
ఓం ఐం హ్రీం శ్రీం కళా తత్త్వాయ ఓం క్రతు ధ్వజాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం విద్యా తత్త్వాయ ఓం గురువే నమః
ఓం ఐం హ్రీం శ్రీం సదాశివ తత్త్వాయ ఓం అజేశాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం చక్ర తత్త్వాయ ఓం సుదర్శనాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం సత్ తత్త్వాయ ఓం సర్వ సత్వాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం రజో తత్త్వాయ ఓం రజసే నమః
ఓం ఐం హ్రీం శ్రీం తమో తత్త్వాయ ఓం తమసే నమః
ఓం ఐం హ్రీం శ్రీం వహ్ని తత్త్వాయ ఓం వహ్నిమండలాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం సోమ తత్త్వాయ ఓం సోమాయ నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఆదిత్య తత్త్వాయ ఓం అర్కమండలాయ నమః

## అంగన్యాస - కరన్యాసములు

★ ఆయ మూలమంత్రముతో - క్రింద తెలియజేసిన తమ అవయవములను తాకుచుండవలెను.

| (1) | (2) |
|---|---|
| ఓం అంగుష్ఠాభ్యాం నమః | ఓం హృదయాయ నమః |
| ఓం తర్జనీమాభ్యాం నమః | ఓం శిరసే స్వాహ |
| ఓం మధ్యమాభ్యాం నమః | ఓం శిఖాయై వషట్ |
| ఓం అనామికాభ్యాం నమః | ఓం కవచాయహుం |
| ఓం కనిష్ఠికాభ్యాం నమః | ఓం నేత్ర త్రయాయవౌషట్ |
| ఓం కరతలకరపృష్ఠాభ్యామ్ నమః | ఓం అస్త్రాయఫట్ |

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

# 10. యంత్ర ప్రాణప్రతిష్ఠా విధి

ఓమ్ అస్యశ్రీ మహా యంత్ర ప్రాణ ప్రతిష్ఠాపన మహా మంత్రస్య । బ్రహ్మ విష్ణు మహేశ్వరా ఋషయః ఋగ్యజుస్సామా ... థర్వణాని ఛందాంసీ । సకల చైతన్య స్వరూపిణీ పాణ్ర శక్తిః । పర దేవతాహలో బీజాని । స్వరాః శక్తయః బిందవః కీలకమ్ । యంత్రస్య ప్రాణ ప్రతిష్ఠా సిద్ధ్యర్థేజపే వినియోగః ॥

**అంగన్యాస - కర న్యాసము :**

ఓం అం కం ఖం గం ఘం ఙం పృథి వ్యాపస్తేజో వాయు రాకాశాత్మనే హ్రాం అంగుష్ఠాభ్యాం నమః

ఓం ఇం చం ఛం జం ఝుం ఞం శబ్ద స్పర్శ రూప రస గంధాత్మనే హ్రీం తర్జనీభ్యాం నమః

ఓం ఉం టం ఠం డం ఢం ణం త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ... ఘ్రాణాత్మనే హ్రూం మధ్య మాభ్యామ్ నమః

ఓం ఏం తం థం దం ధం నం వాక్పాణి పాద పాయూపస్థాత్మనే హ్రైం అనామికాభ్యామ్ నమః

ఓం ఐం పం ఫం బం భం మం వచన దాన విసర్గా ... నందాత్మనే హ్రూం కనిష్ఠికాభ్యాం నమః

ఓం ఓం యం రం లం వం శం షం సం హం ళం క్షం మనోబుద్ధి చిత్తా ...హంకార జ్ఞానాత్మనే హ్రాః కరతల కర పృష్ఠాభ్యాం నమః

ఓం అం కం ఖం గం ఘం ఙం పృథి వ్యాపస్తేజో వాయు రాకాశాత్మనే హ్రాం హృదయాయ నమః

ఓం ఇం చం ఛం జం ఝుం ఞం శబ్ద స్పర్శ రూప రస గంధాత్మనే హ్రీం శిరసే స్వాహా

ఓం ఉం టం ఠం డం ఢం ణం త్వక్చక్షు శ్రోత్ర జిహా... ఘ్రాణాత్మనే హ్రూం శిఖాయై వషట్

ఓం ఏం తం థం దం ధం నం వాక్పాణి పాద పాయూపస్థాత్మనే హైం కవచాయ హూం

ఓం ఐం పం ఫం బం భం మం వచన దాన విసర్గానందాత్మనే హ్రూం నేత్ర త్రయాయవౌషట్

ఓం ఓం యం రం లం వం శం షం సం హం ళం క్షం మనోబుద్ధి చిత్తహంకార జ్ఞానాత్మనే హ్రః అస్త్రాయ ఫట్ ఓమ్ భూర్భువ స్సువరోమితి దిగ్బంధః ॥

# ధ్యానము

శ్లో ॥ రక్తా ...బోధి స్తపతోల్లస దరుణ సరోజా...ధిరూఢా కరాబ్జైః
పాశమ్‌కోదండ మిక్షూద్భవ మణిగణ మప్యంకుశం పంచబాణా ।
న్బిభ్రాణమ్ సృక్కపాలమ్ త్రినయన విలసత్పీన వక్షో రుహాఢ్యా
దేవీ బాలార్క వర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః ॥

★ (పిదప ఈ క్రింది మంత్రమును చదువుచూ - దర్భలతో యంత్రమును అభిమంత్రించవలెను)

**మంత్రము :**

ఓం అసునీతే పునరస్మా సు చక్షుః పునః ప్రాణ మిహానో దేహిభోగమ్ జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే మృడయాన స్వస్తి ఓమ్ అమృతమ్ వై ప్రాణాః అమృతమా...పః ప్రాణానేవ యధాస్థాన ముపహ్వాయతే ॥

ఓమ్ భూర్భువస్సువః ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం హంస స్సో...హమ్ హంసః ..............................యంత్ర ప్రాణ ఇహప్రాణ, జీవ, ఇహ జీవ, ప్రాణ జీవ ఇహ ప్రాణ జీవ స్థితాః త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ... ఘ్రాణ వాక్పాణి పాద పాయూప స్థాది సర్వేంద్రియాణి । సర్వ తత్వాని ఇహైవా గత్య ................. ఆస్య యంత్ర్ సుఖమ్ చిరమ్ తిష్ఠంతు స్వాహా ॥

★ (ఈ క్రింది మంత్రము చదువుచూ యంత్రము మీద పుష్పములు, అక్షతలు ఉంచవలయును)

ఓం హం సం హంస హంసాయ విద్మహే । పరమ హంసాయ ధీమహీ । తన్నో హంసః ప్రచోదయాత్ ॥ సో ... హమ్ హంసస్సో ... హమ్ హంసః ॥

# 11. కళా న్యాసము

ఓమ్ అస్యశ్రీ కళా మాతృకాన్యాసస్య । ప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ కళా మాతృకా సరస్వతీ దేవతా । ఓమ్ బీజమ్ । ఔం శక్తిః । ఆం కీలకమ్ । శ్రీ (యంత్రము పేరు) యంత్రస్య చైతన్యతా సిద్ధ్యర్థే జపే వినియోగః ॥ అం ఆం ఇం ఈం ఉం ఊం ఏం ఐం ఓం ఔం అం అః ఇతి వర్ణేన షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥

**ధ్యానము :-**

శ్లో ॥ హస్తైః పద్మమ్ రథాంగమ్ గుణమథ హరిణమ్ పుస్తకమ్ వర్ణమాలామ్
టంకం శుభ్రమ్ కపాలమ్ వర మమృత లసద్దేమ కుంభమ్ వహంతీమ్।
ముక్తా విద్యు త్పయోద స్పటిక నవ జపా బంధురైః పంచ వక్త్రైః ।
త్ర్యక్షై ర్వక్షోజ నమ్రామ్ సకల శశి నిభామ్ శారదామ్ తాం నమామి ॥

★ (ఈ క్రింది తెలిపిన బీజాక్షరములకు ముందు "ఓం ఐం హ్రీం శ్రీం " అని కలపి చదువుచు - ఆయా యంత్ర స్థానము లందు అక్షతలను చల్లుచుండవలెను)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఓం ఐం హ్రీం శ్రీం | అం | నివృత్తి | కళా | మావాహయామి | నమః | శిరసి |
| " | ఆం | ప్రతిష్ఠా | " | " | " | ముఖవృత్తే |
| " | ఇం | విద్యా | " | " | " | దక్షనేత్రే |
| " | ఈం | శాంతి | " | " | " | వామ నేత్రే |
| " | ఉం | ఇందిరా | " | " | " | దక్ష కర్ణే |
| " | ఊం | దీపికా | " | " | " | వామ కర్ణే |
| " | ఋం | రేచికా | " | " | " | దక్షిణానాసికామ్ |
| " | ౠం | మోచికా | " | " | " | వామ నాసికామ్ |
| " | ఌం | పరా | " | " | " | దక్షకపోలే |
| " | ౡం | సూక్ష్మా | " | " | " | వామకపోలే |
| " | ఏం | సూక్ష్మామృత | " | " | " | ఓష్ఠే |
| " | ఐం | జ్ఞానా | " | " | " | అధరే |
| " | ఓం | జ్ఞానామృతా | " | " | " | ఊర్ధ్వదంతేషు |
| " | ఔం | ఆప్యాయనీ | " | " | " | అధోదంతేషు |
| " | అం | వ్యాపినీ | " | " | " | జిహ్వాయామ్ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఓం ఐం హ్రీం శ్రీం | అః | వ్యోమరూపా | కళా | మావాహయామి | నమః | అస్యవివరే |
| " | కం | సృష్టి | " | " | " | దక్షబాహుమూలే |
| " | ఖం | బుద్ధి | " | " | " | దక్షకూర్పరి |
| " | గం | స్మృతి | " | " | " | దక్షమణిబంధే |
| " | ఘం | మేధా | " | " | " | దక్షకరాంగులీమూలే |
| " | ఙం | కాంతి | " | " | " | దక్షకరాంగుల్యగ్రే |
| " | చం | లక్ష్మీ | " | " | " | వామ బాహు మూలే |
| " | ఛం | ద్యుతి | " | " | " | వామ కూర్పరి |
| " | జం | స్థిరా | " | " | " | వామ మణి బంధే |
| " | ఝం | స్థితి | " | " | " | వామ కరాంగులీ మూలే |
| " | ఞం | సిద్ధి | " | " | " | వామ కరాంగుల్యగ్రే |
| " | టం | జరా | " | " | " | దక్షోరుమూలే |
| " | ఠం | పాలినీ | " | " | " | దక్ష జానునీ |
| " | డం | శాంతి | " | " | " | దక్ష గుల్ఫే |
| " | ఢం | ఈశ్వరీ | " | " | " | దక్షపాదాంగులీ మూలే |
| " | ణం | రతి | " | " | " | దక్ష పాదాంగుల్యగ్రే |
| " | తం | కామికా | " | " | " | వామోరు మూలే |
| " | థం | వరదా | " | " | " | వామ జానునీ |
| " | దం | హాదినీ | " | " | " | వామ గుల్ఫే |
| " | ధం | ప్రీతి | " | " | " | వామపాదాంగులీమూలే |
| " | నం | దీర్ఘా | " | " | " | వామ పాదాంగుల్యగ్రే |
| " | పం | తీక్ష్ణా | " | " | " | దక్ష పార్శ్వే |
| " | ఫం | రౌద్రా | " | " | " | వామ పార్శ్వే |
| " | బం | భయా | " | " | " | పృష్ఠే |
| " | భం | నిద్రా | " | " | " | నాభౌ |
| " | మం | తంద్రీ | " | " | " | జఠరా |
| " | యం | క్షుధా | " | " | " | హృదయే |
| " | రం | క్రోధినీ | " | " | " | దక్షాంసే |
| " | లం | క్రియా | " | " | " | కకుది |
| " | వం | ఉద్గారుణీ | " | " | " | వామాంసే |
| " | శం | మృత్యు | " | " | " | హృదయాది దక్ష కరాగ్రాన్తమ్ |
| " | షం | పీతా | " | " | " | హృదయాది వామకరా గ్రాన్తమ్ |
| " | సం | శ్వేతా | " | " | " | హృదయాది దక్ష పాదాగ్రాన్తమ్ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఓం ఐం హ్రీం శ్రీం | హం | అరుణా | కళా | మావాహయామి | నమః | హృదయాది వామ పాదాగ్రాన్తమ్ |
| ” | ళం | అసితా | ” | ” | ” | హృదయాది నాభ్యంతరమ్ |
| ” | క్షం | అనన్తా | ” | ” | ” | హృదయాది మూర్ధాంతమ్ |

ఓమ్ ప్రణోదేవీ సరస్వతీ వాజేభి ర్వాజనీవతి ధీనామ విద్రయవత్ (త్రివారమ్ పరిత్వా)

ఓం బ్రహ్మాత్మన్ వదసృజత తదాకామ యాత సమాత్మనా పద్యేయేతి . . . . . . . . . యఏవం వేద ॥

## 12. కుశ గ్రంథి మంత్రము

★ (ఈ క్రియకు సూచన : ఎనిమిది దర్భలను తూర్పు కొసలుగా చేతగైకొని క్రింద తెల్పిన మంత్రమునుచ్చరించుచూ, తూర్పు ముడి ఉండు విధముగా యంత్రమునకు కట్టవలెను. మరల ఎనిమిది దర్భలను ఉత్తరాగ్రముగా చేతగైకొని - రెండవ మంత్రమునుచ్చరించుచూ - ఉత్తరముగా ముడి ఉండునటుల యంత్రమునకు కట్టవలయును)

**1. మంత్రము:** ఓమ్ బృహత్సామ క్షత్ర భృద్వృద్ధ వృష్టి యంత్రిష్టు భౌజ శ్శుభిత ముగ్రవీరమ్ ఇంద్ర స్తోమేన పంచదశేన మధ్యమిదమ్ వాతేన సగరేణ రక్ష ॥

**2. మంత్రము :** ఓమ్ విశ్వేత్తాతే సవనేషు ప్రవాచ్యాయా చ కర్థమఘవన్నింద్ర సున్వతే పారావతమ్ యత్పురుషమ్ భృతమ్ వ స్వపావృణో శ్శరభాయ ఋషి బంధవే

శ్లో ॥ సర్వ దేవమయా చిహ్నసర్వ ఉత్నోజ్జ్వలాకృతే।
యావచ్చంద్రశ్చ సూర్యచ్చ తావదత్ర స్థిరోభవ ॥

(పుష్పములను, అక్షితలను యంత్రముపై నుంచి నమస్కరించవలయును)

ఇంతదనుక తెలియజేసిన క్రియ అంతయు యంత్రమునకు యధావిధిగా జరుపవలసిన సంస్కార ప్రక్రియ మాత్రమే. కుశగ్రంథి సంస్కారముతో పూర్తియైన

పిదపనే యంత్రమునకు పురుషసూక్త, శ్రీ సూక్త విధానముతో నియమింపబడిన దినములు నిత్య షోడశోపచార పూజలను గావింపవలయును. యంత్రమునకు బలమును వృద్ధి చేయుటకై - ఆయా యంత్రములకు సంబంధించిన మూల మంత్రమును అత్యంత దీక్షా నియమములతో నిత్యము జపించి యంత్రార్పణ గావించవలయును.

**జప సంఖ్య :** యంత్రమునకు నియుక్తమైన మూల మంత్రమును :-

1. మంత్రాక్షరముల సంఖ్య ఎంతయో అన్ని లక్షల సార్లు జపించిన - ఉత్తమము
2. ఐదు లక్షల సార్లు - మధ్యమము
3. లక్షసార్లు జపించుట - సాధారణ జపము

ఈ పై జప, పూజాదులు కనీసము 40 రోజులు అనగా ఒక మండలము, లేదా కనీసం 11 రోజులు జరిపి యంత్రార్పితము గావించవలెను. ఇట్లు యధావిధి నిర్వహించిన క్రియా మూలమున సంకల్పిత ఫలములను శీఘ్రం గతిని ప్రసాదించుటకు సమర్ధవంతములై నుండగలవు.

**ఓం ఓం ఓం ఓం ఓం**

**సమస్త సన్మంగళానిభవంతు.**

# యంత్రము స్థాపించు ప్రదేశములు

ఆగమ శాస్త్రాను వచనము సర్వ సాధారణముగా ప్రతి యంత్రమును - తమ గృహము నందలి ఈశాన్య భాగమున శాస్త్ర విధిగా, స్థాపించుకొన వచ్చును.

కాని, కొన్ని గృహములందు, వివిధ రకములైన దోషములుండవచ్చును. కావున, తత్‌దోష నివారణార్ధము, దానికి సంబంధించిన యంత్రమును, ఆయా ప్రత్యేక స్థానములందు ప్రతిష్టింపవలయునని కూడా శాస్త్ర ప్రమాణము కలదు. వాటి వివరములు కొన్ని సూచించడమైనది.

వాస్తు బ్రహ్మ యంత్రమును, మత్స్య యంత్రమును గృహగర్భమునందలి మధ్య ప్రదేశమున ప్రతిష్ఠాపించుట ఉత్తమమైన దనియు, ఈశాన్య భాగమున ద్వితీయ పక్షమనియు నెఱంగవలెను. మహాలక్ష్మి యంత్రమును తూర్పు భాగమందును, ఇంద్ర యంత్రమును- సింహ ద్వారమునకు గల పై భాగమునందును, రుద్ర సంబంధిత యంత్రములను ఉత్తర దిశయందును, సుబ్రహ్మణ్య, గణపతి, ఆంజనేయ - యంత్రములను దక్షిణ దిశయందును, విష్ణు సంబంధిత యంత్రములను - పశ్చిమ దిశ యందును స్థాపించుకొనవచ్చునని శాస్త్ర ప్రమాణము.

# యంత్రస్థాపన - శుభ సమయములు

**ఆయనములు** : ఉత్తరాయణమునందు (అనగా సూర్యుడు మకరరాశి ప్రవేశము నుండి) యంత్ర స్థాపన చాల యోగ్యమని, కొన్ని యంత్రములకు దక్షిణాయనము (అనగా సూర్యుడు కటకరాశి ప్రవేశానంతరము) కూడా ప్రశస్తము, యోగ్యమనియు తెలియనగును.

దక్షిణాయణము నందు - గాయత్రి, భద్రకాళి, శూలినీ దుర్గ, చండీ, మృత్యుంజయ, ఆంజనేయ, సుదర్శన, రుద్ర, ఇంద్ర, శీతలా, మొదలుగా గల యంత్రములకు యోగ్యమైనది. యంత్ర స్థాపనకు పగలు పూర్వాహ్నమే యోగ్యమైన కాలము.

**మాసములు** :- 1. ఉత్తమము :- చైత్ర, వైశాఖ, శ్రావణ, ఆశ్వీజ, కార్తీక, మాఘ, ఫాల్గుణ మాసములు.

2. మధ్యమము : జేష్ఠ, ఆషాఢములు

**తిథులు :-** 1. శుక్ల పక్ష తదియ నుండి కృష్ణపక్ష (బహుళ) దశమి వరకు అత్యంతయోగ ప్రదములు
2. తదియ, పంచమి, సప్తమి, అష్టమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిథులు శుభ ప్రదమైనవి.

**వారములు :** ఆది, సోమ, బుధ, గురు, శుక్ర వారములు అత్యుత్తమమైనవి.

**నక్షత్రములు :** రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, ఉ॥ షాఢ, ధనిష్ట, శతభిషము, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు ఉత్తమమైనవని శాస్త్ర ప్రమాణము.

**లగ్నములు :** వృషభ, మిధున, సింహ, కన్య, ధనుస్సు, కుంభ మీనములు యోగ్యములు.

ముహూర్తము యజమానికి తారాబల, చంద్ర బల యుక్తముతో, లగ్నము పంచక రహితమై యుండవలయును. ముఖ్యముగా ముహూర్త లగ్నమునకు - 8వరాశి యందు కుజుడు, ఆరవ రాశి యందు శుక్రుడు మరియు పన్నెండవ అనగా లగ్నాత్తు వ్యయస్థానమున సూర్యుడును ఉండరాదు. లగ్నాత్తు కేంద్ర కోణములందు శుభ గ్రహములును, 3,6,11 స్థానముల యందు పాపగ్రహములు ఉండవలెనని ప్రమాణము.

**నిషిద్ధ కాలము :** శూన్య, అధిక మాసముల యందును, మూఢమి, కర్తరిల యందు, వర్జ, దుర్మూహూర్తాదులందు, వృశ్చిక, మేష, తుల, మకర, లగ్నములందును, సంధ్యా కాలము, సంవత్సర సూతకం, భార్య బహిష్టు సమయ మందును, భార్య 6 వ నెల గర్భిణిగా నున్నపుడు జాతాశౌచ, మృతశౌచ సమయములందును యంత్ర స్థాపనకు నిషిద్ధములు - చేయరాదు.

# యంత్రము - షోడశోపచార పూజ విధము

అదౌ దీపా రాధనమ్ కృత్వా ॥

(ముందుగా దీపారాధన జేసి - నమస్కరించి ఇంతకు ముందు - యంత్ర సంస్కార భాగమున తెల్పిన విధముగా "సంకల్పము" ను చేయవలయును. పిదప క్రింది విధముగా గణపతి ధ్యానము చేయవలయును.

**గణపతి ధ్యానమంత్రము :** ఓం గణానామ్ త్వా గణపతిగ్మ్ హవా మహే। కవిమ్ కవినా ముపమశ్రవస్తమమ్ । జ్యేష్ఠ రాజమ్ బ్రహ్మణాన్ బ్రహ్మణ స్పత అన శృణ్వన్నూతి బిస్సీద సాధనమ్ ॥ ఓం శ్రీ మహా గణాధిపతయే నమః ధ్యానమ్ సమర్పయామి - (అని గణపతికి నమస్కరించవలయును)

**సూచన :** "యంత్రము" అని వచ్చిన ప్రతి చోట ఆ యంత్రము యొక్క పేరును చెప్పవలెను. ............. యంత్ర పూజామ్ గత్వేన తదంగ కలశా రాధనమ్ కరిష్యే"

# కలశపూజ

కలశమ్ గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య శుద్ధ జలం పూరయిత్వా( అని చెప్పుచూ - ఒక పాత్ర యందు మంచి నీటిని తీసుకొని, దానిని పుష్ప, అక్షతలతో అలంకరించి - ఈ దిగువ మంత్రముతో అభిమంత్రించవలెను)

శ్లో ॥ కలశస్య ముఖే విష్ణుమ్ కంఠే రుద్ర స్సమాశ్రితః ।
మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాస్స్మృతాః ॥
కుక్షౌతు సాగరా స్సర్వే సప్త ద్వీపా వసుంధరా ।
ఋగ్వేదో...థ యుజుర్వేద స్సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥

**మంత్రము :** ఆ కలశేషు ధావతి పవిత్రే పరిష్యతే ఉక్తై ర్యజ్ఞేషు వర్ధతే ॥ కలశోదకేన పూజాద్రవ్యాణి, దేవ మాత్మానమ్ చ సంప్రోక్ష్య॥ (అని చెప్పుచు, కలశము నందు నీటిని యంత్రము పైన, పూజా ద్రవ్యములపైన తనపైన చల్లుకొనవలయును.)............. యంత్ర దేవతాభ్యోనమః । షోడశోపచార పూజాం కరిష్యే ॥ (అని నీటిని తాకవలయును)

# యంత్ర ధ్యానము

ఓం యంత్ర రాజాయ విద్మహే । మహా యంత్రాయ ధీమహి । తన్నో యంత్ర ప్రచోదయాత్ ॥

(ఇక్కడ పై మంత్రము తర్వాత, ఏయంత్రమో ఆ యంత్ర సంబంధిత "ధ్యాన" శ్లోకమును చదువవలెను.)

# ఆవాహనము

ఓమ్ సహస్ర శ్రీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్।
స భూమిమ్ విశ్వతో వృత్వా అత్య తిష్ఠ ద్దశాంగులం॥

ఓం హిరణ్యా వర్ణామ్ హరిణీమ్ సువర్ణ రజత స్రజామ్ చంద్రాం హిరణ్మయామ్ లక్ష్మీమ్ జాతవేదో మహోవహ......................యంత్ర దేవతాభ్యోన్నమః । ఆవాహనం సమర్పయామి (అని యంత్రము మీద పుష్పాక్షతలు ఉంచవలయును)

# సింహాసనము

ఓం పురుష ఏ వేదగమ్ సర్వమ్ యద్భూతమ్ యచ్చ భవ్యమ్ ఉతామృతత్వ స్యేశానః యదన్నే నాతిరోహతి ఓం తాంమ్మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామనీమ్ । యస్యాం హిరణ్య విన్దేయమ్ గామశ్వమ్ పురుషానహమ్ ॥

....................................యంత్ర దేవతోభ్యోన్నమః సింహాసనమ్ సమర్పయామి - (అని అక్షతలు చల్లవలయును)

# అర్ఘ్యము

ఓమ్ ఏ తావానస్య మహిమా అతోజ్యా యగశ్చ పూరుషః పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యా మృతందివి ॥ ఓమ్ అశ్వ పూర్వామ్ రథ మధ్యామ్ హస్తినాద ప్రబోధినీమ్ శ్రియందేవీ ముపహ్వాయే శ్రీర్మాదేవీ జుషతామ్ ॥ ......................... యంత్ర దేవతా భ్యోనమః - అర్ఘ్యమ్ సమర్పయామి - (అని యంత్రం మీద నీరు చల్లవలెను)

# పాద్యము

ఓం త్రిపా దూర్ధ్వ ఉదై త్పురషః పాదో ... స్యేహ భవాత్పునః తతో విష్వవ్య క్రామాత్ సాశనా నశనే అభి॥ ఓం కాంసోస్మితామ్ హిరణ్య ప్రాకారా మార్ద్రాం జ్వలన్తీమ్ తృప్తామ్ తర్ప యంతీమ్ పద్మేస్థితామ్ పద్మ వర్ణామ్ తా మిహోపహ్వాయే శ్రియమ్ ॥ .................. యంత్ర దేవతాభ్యోనమః - పాద్యం సమర్పయామి (మరల ఉదకము చల్లవలెను)

# ఆచమనీయము

ఓమ్ తస్మా ద్విరాడ జాయత విరాజో అధి పూరుషః సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మధోపురః ॥

ఓం చంద్రాం ప్రభాసామ్ యశసా జ్వలన్తీమ్ శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ తామ్ పద్మినీ మీమ్ శరణ మహమ్ ప్రపద్యే...లక్ష్మీర్యేన శ్యతామ్ త్వామ్ వృణే ॥

......................యంత్ర దేవతాభ్యోనమః ఆచమనీయం సమర్పయామి - (అని మరల ఉదకమును చల్లవలెను).

# మధుపర్కము

ఓం యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత వసన్తో అస్యాపీదాజ్యమ్ గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥

ఓమ్ ఆదిత్య వర్ణే తపసో... ధి జాతో వనస్పతి స్థవ వృక్షో ... ధ బిల్వః తస్య ఫలాని తపసానుదంతు మాయాంత రాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥

.......................... యంత్ర దేవతాభ్యో నమః మధుపర్కమ్ సమర్పయామి ॥ (అని ప్రత్తితో చేసిన మధుపర్కంను యంత్రము మీద ఉంచవలెను.)

# స్నానము

ఓమ్ సప్తాస్యాస న్పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః దేవా యద్యజ్ఞమ్ తన్వానాః అబద్న న్పురుషమ్ పశుమ్ ॥

ఓమ్ ఉపైతు మామ్ దేవ సఖః కీర్తిశ్చ మణినా సహ ప్రాతుర్భూతో... స్మి రాష్ట్రే ...స్మిన్ కీర్తి మృద్ధిమ్ దదాతు మే ॥ (అని పంచామృతులుగాని, నీటిని గాని యంత్రము మీద చల్లవలయును)...................యంత్ర దేవతాభ్యోనమః స్నానమ్ సమర్పయామి ॥

# వస్త్రము

ఓమ్ తమ్ యజ్ఞమ్ బర్హిషి ప్రోక్షన్ పురుషమ్ జాత మగ్రతమ్ । తేనదేవా అయజంత సాధ్యా ఋషయశ్చయే ॥

ఓం క్షుత్పిపాసా ... మలామ్ జేష్ఠా మలక్ష్మీ ర్నా శయామ్యహమ్ అభూతి మ సమృద్ధిమ్ చ సర్వా న్నిర్ణుదమే గృహాత్ ॥

......... యంత్ర దేవతాభ్యోనమః వస్త్రం సమర్పయామి

# యజ్ఞోపవీతము

ఓం తస్మా ద్యజ్ఞా త్సర్వ హుతః సంభృతమ్ । పృషదాజ్యమ్ పశూగ్ స్తాగ్శ్చక్రే వాయవ్యాన్ ఆరణ్యా గ్రామాశ్చ యే॥

ఓం గంధ ద్వారామ్ దురాధర్షామ్ నిత్య పుష్టామ్ కరీషిణీమ్ ఈశ్వరీగ్మ్ సర్వభూతనాం తామి హోపహ్వయే శ్రియమ్ ॥

..........................యంత్ర దేవతాభ్యోన్నమః యజ్ఞోపవీతమ్ సమర్పయామి.

# శ్రీగంధము

ఓమ్ తస్మా దశ్వా అజాయన్త ఏకేచో భయాదతః గావోహ జజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయః ॥

ఓమ్ మనసః కాకుమా కూతిమ్ వా చ స్సత్య మశీమహి పశూనాగ్మ్ రూప మన్నస్య మయిశ్రీ శ్శ్రయతామ్ యశః ॥ .......................యంత్ర దేవాతాభ్యోనమః దివ్య శ్రీ చందనం సమర్పయామి ॥

ఈ క్రింది మంత్రములు చదువుచు పుష్పములు, అక్షతలతో పూజించవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఓమ్ | భూః | ............... | యంత్రాయ నమః | పుష్పాక్షతై | పూజయామి |
| ఓమ్ | భువః | ............... | " | " | " |
| ఓగ్మ్ | సువః | ............... | " | " | " |
| ఓమ్ | మహః | ............... | " | " | " |
| ఓమ్ | జనః | ............... | " | " | " |
| ఓమ్ | తపః | ............... | " | " | " |
| ఓగ్మ్ | సత్యం | ............... | " | " | " |

ఈ క్రింది నామములతో యంత్రమును పుష్పములు, అక్షతలతో పూజించవలయును.

ఓం బ్రహ్మణేనమః । ఓం విష్ణవే నమః । ఓం రుద్రాయ నమః ।
ఓం సత్యాయ నమః । ఓం జ్ఞానాయ నమః । ఓం ఐంకారయ నమః ।
ఓం హ్రీంకారాయ నమః । ఓం శ్రీంకారాయనమః। ఓం క్లీంకారాయ నమః।
ఓం సౌఃకారాయ నమః । ఓం మాయామ నమః।
ఓం పాశాయ నమః । ఓం అంకుశాయ నమః ।
ఓం చక్రాయ నమః । ఓం వరదాయ నమః । ఓం అభయాయ నమః ।
ఓం ఇంద్రాయ నమః । ఓం అగ్నయే నమః ।
ఓం యమాయ నమః । ఓం నైఋతయే నమః ।
ఓం వరుణాయ నమః । ఓం వాయవే నమః ।
ఓం కుబేరాయ నమః । ఓం ఈశానాయ నమః ।
ఓం ఊర్ధ్వపురుషాయ నమః । ఓం పృథివ్యై నమః ।
ఓం నారాయణాయ నమః । ఓం రూపాయ నమః ।
ఓం శబ్దాయ నమః । ఓం స్పర్శాయ నమః ।
ఓం రసాయ నమః । ఓం గంధాయ నమః ।
ఓం వాగ్మినే నమః । ఓం పాణినే నమః । ఓం పాదాయ నమః ।
ఓం పాయవేనమః । ఓం ఉపస్థాయ నమః ।
ఓం మానసాయ నమః । ఓం బుద్ధయే నమః ।
ఓం చిత్తాయ నమః । ఓం అహంకారాయ నమః ।
ఓం సర్వతన్మాత్రాయ నమః । ఓం అం నమః ।
ఓం ఆం నమః । ఓం ఇం నమః । ఓం ఈ నమః ।
ఓం ఉం నమః। ఓం ఊం నమః। ...................................................... ఓం క్షం నమః ॥

................................ యంత్ర దేవాతా భ్యోనమః । నానా విధ పరిమళ పత్ర పుష్పాక్షతాని సమర్పయామి !!

## ధూపము

**ఓం యత్పురుషమ్ వ్యదధుః కతిధావ్య కల్పయన్ ముఖమ్ కిమస్యకౌ బాహుకా ఊరూ పాదా ఉచ్యతే ॥**

ఓం కర్దమేన ప్రజాభూతా మయిసంభవ కర్దమ శ్రియమ్ వాసయమే కులే మాతరమ్ పద్మ మాలినీమ్॥

.................... యంత్ర దేవతాభ్యో నమః ధూపమాఘ్రాపయామి ।

## దీపము

ఓం బ్రాహ్మణో ... స్య ముఖ మాసీత్ బాహు రాజ్యనః కృతః ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగమ్ శూద్రో అజాయత ॥ ఓమ్ ఆపః స్రజంతు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే నిచ దేవీమ్ మాతరమ్ శ్రియమ్ వాసయమే కులే॥

.................. యంత్ర దేవతాభ్యో నమః దీపం సమర్పయామి ॥

## నైవేద్యము

ఓం చంద్రమా మనసో జాతః చ సూర్యో అజాయత ముఖా దింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత ॥ ఓమ్ ఆర్ద్రామ్ పుష్కరిణీమ్ పుష్టిమ్ పిజ్గలామ్ పద్మమాలినీమ్ సూర్యామ్ హిరణ్మయీమ్ లక్ష్మీమ్ జాతవేదో మహవహా॥

............................... యంత్ర దేవతాభ్యోనమః నైవేద్యమ్ సమర్పయామి॥
(నివేదనగా - నారికేళము, కదళీఫలము, పాయసములను - నివేదించవలెను)

## తాంబూలము

ఓం నాభ్యా ఆసీ దంతరిక్షమ్ శీర్ష్ణోద్యౌ సమవర్తత పద్భ్యామ్ భూమిర్దిశ శ్శోత్రాత్ ఉథా లోకాగ్మ్ అకల్పయన్ ॥ ఓమ్ ఆర్ద్రామ్ యః కరిణీమ్ యష్టిమ్ సువర్ణామ్ హేమ మాలినీమ్ చన్ద్రామ్ హిరణ్మయీమ్ లక్ష్మీమ్ జాతవేదో మమ ఆవాహ ॥

......................... యంత్ర దేవతాభ్యో నమః తాంబూలం సమర్పయామి ॥

## నీరాజనము

ఓం వేదాహమేతమ్ పురుషమ్ మహంతమ్ ఆదిత్య వర్ణమ్ తమసస్తు పారే సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వా... భివదన్ యదాస్తే ॥ ఓం తాంమ్మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనప గామినీమ్ యస్యామ్ హిరణ్యామ్ విన్దేయమ్ ప్రభూతమ్ గావో దాస్యోస్యాన్ విన్దేయమ్ పురుషా... నహమ్॥

........................యంత్ర దేవతాభ్యో నమః కర్పూర ఆనంద నీరాజనం సమర్పయామి.

# మంత్ర పుష్పము

ఓమ్ధాతా పురస్తా ద్యముదాజహార శక్రప్ర । విద్యాన్ ప్రదిశశ్చతస్రః తమేవమ్ విద్వా నమృత ఇహ భవతి నాన్యపంథా అయనాయ విద్యతే ॥ ఓమ్ సహస్ర పరమాదేవి శతమూలా శతంకురా స్వరగమ్ హరతు మే పాపమ్ దూర్వా దుస్వప్న నాశని॥

.......... యంత్ర దేవతాభ్యో నమః సువర్ణ దివ్య మంత్ర పుష్పమ్ సమర్పయామి !

# ఆత్మప్రదక్షిణ నమస్కారము

ఓమ్ ఉద్యంత మస్తమ్ యమ్ తమాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలమ్ భద్రమశ్నుతే .. సా వాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవమ్ వేద అసా వాదిత్యో బ్రహ్మ ॥

శ్లో ॥ ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా।
పద్భ్యామ్ కరాభ్యామ్ కర్ణాభ్యామ్ ప్రణామో.. ష్టాంగ ఉచ్యతే ॥

................ యంత్రదేవతా భ్యోనమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి !!

# ఉపచారములు

.................. యంత్రదేవాతాభ్యో నమః ! ఛత్రమ్ ధారయామి ! చామరమ్ వీచయామి ! అశ్వానారోహయామి । గజానారోహయామి । నృత్యమ్ దర్శయామి ! గీతమ్ శ్రావయామి వాద్యం ఘోషయామి రాజోపచార, శక్త్యోపచార, భక్త్యోపచారన్ సమర్పయామి (అని పుష్పాక్షతలను చల్లవలెను)

# అర్పణము

యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః పూజా క్రియా దిషు. న్యూనమ్ సంపూర్ణతా యాన్తి సద్యోవన్దే జనార్ధనమ్ మంత్ర హీనమ్ క్రియాహీనమ్ భక్తిహీనమ్ తు యద్భవేత్ తత్సర్వమ్ క్షమ్యతామ్ దేవ పరిపూర్ణమ్ తదస్తుతే ॥ అనేన శ్రీసూక్త, పురుషసూక్త విధానేన.......... యంత్ర దేవతా షోడశోపచార పూజనేన భగవాన్ సర్వాత్మక ఏతత్ఫలమ్............ యంత్రదేవతార్పణ మస్తు ॥

(అనుచు అక్షతలు, పుష్పములు, నీరును వదలవలెను)

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రి యైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్ ॥
కరోమి యద్య త్సకలమ్ పరస్మై శ్రీమన్నారాయణేతి సమర్పయామి ॥

# జపము - ధారాదత్తము

ఆయా యంత్రములకు సంబంధించిన మంత్ర జపము జరిపిన పిమ్మట - పుష్పాక్షతలను, జలమును చేతిలోనికి తీసుకుని - ఈ క్రింద చేప్పిన మంత్రము చదువుచూ - యంత్రము మీద వదులవలెను

గోత్రస్య .................. నామధేయస్య పూర్వోక్త సంకల్ప ప్రకారేణ ఇష్ట కామ్యార్థ సిద్ధ్యర్థమ్ మయాచరిత ................. మంత్ర జపేన ............. యంత్రస్య ప్రాణ జీవ బల తేజో వివర్ధన సిద్ధిరస్తు । యంత్ర ప్రకాశనమస్తు ! యజమానస్య మనోరథ ఫలసిద్ధిరస్తు ॥

ఓం శాంతి : శాంతి : శాంతి :

సమస్త సన్మంగళాని భవంతు

# 1. శ్రీ లక్ష్మీ గణపతి యంత్రము



**మూల మంత్రము :-** ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వ జనంమే వశమానయ స్వాహా !

**యంత్ర నిర్మాణము :** ఈ యంత్రమును 5" x 5" సైజు గల రాగిరేకు మీదగాని, వెండి రేకు మీద గాని పై విధముగా నిర్మించవలయును.

**పూజ విధి :** యంత్రమును శాస్త్రోక్తముగా శుద్ధి చేయవలెను. అటు పిమ్మట యంత్రమునకు ప్రాణ ప్రతిష్ట విధి విధానములన్నియు జరుపవలెను.

అటు పిమ్మట యంత్రమునకు 40 రోజులు (మండలము) మూల మంత్రమును జపించి, హోమము చేయవలెను.

**హోమము** : తెల్లజిల్లేడు (శ్వేతార్కము) హోమ చూర్ణము, ఆవు నేయికలిపి, చతురస్ర హోమ కుండలి యందు 516 సార్లు మూల మంత్రముతో హోమమును చేయవలెను. ఈ విధముగా 40 రోజులు చేయవలెను.

చివరి రోజున బ్రాహ్మణులకు, వారి వారి శక్తి కొలది సంతర్పణ చేయ వలయును. శక్తి కొలది దానములు చేయవలెను. పిదప యంత్రమును గృహమునందుగాని, వ్యాపార స్థలమందుగాని ఉంచి, నిత్యము పంచ పూజలు నిర్వహించవలయును.

**తర్పణము** : గణపతి తర్పణ ప్రియుడు. జప, హోమానంతరం తర్పణము చేయవలెను.

1. మొదటిగా, ముందు చెప్పిన మూల మంత్రము చెప్పి దాని చివర " శ్రీ మహాగణపతిం తర్పయామి" అని చెప్పి 12 మార్లు తర్పణమును,
2. తరువాత మూలమంత్రము నందలి ప్రతి అక్షరము చివర "స్వాహా" అని చేర్చి " శ్రీ మహా గణపతిం తర్పయామి" అని చెప్పి 4 సార్లును, మరల
3. మూలమంత్రము చివర " శ్రీ మహా గణపతిం తర్పయామి" అని చెప్పి 4 సార్లును తర్పణము చేయవలయును.

**ఫలము** : ఈ యంత్రము చాలా మహిమాన్వితమైనది, సర్వ దోషములు నివారించగల శక్తి గలదనియు శాస్త్ర ప్రమాణము. ధనప్రాప్తి, విజ్ఞాన ప్రాప్తి, సకల విద్యా ప్రాప్తి, ఐశ్వర్య ప్రాప్తి మొదలగు శుభములు చేకూరును.

**సూచన** : తర్పణము కొరకు శుద్ధ జలమునుగాని, పాలనుగాని తీసుకొని దాని యందు గంధ పుష్పాక్షతలను కలుపవలెను.



# ౭. సుబ్రహ్మణ్యేశ్వర యంత్రము



**మూల మంత్రము :-**

1. ఓం సౌం శరవణ భవ (అష్టాక్షరి)

2. ఓం శరవణభవాయ హే నాగరాజాయ మమదేహే సర్వ వంధ్యాది రోగాన్ నాశయ నాశయ వజ్ర దేహం కురు కురు సంతానం దేహి దేహి సకల కార్యాణి సాధయ సాధయ ఫట్ స్వాహా

**సుబ్రహ్మణ్య గాయత్రి :-** ఓం తత్పురుషాయ విద్మహే మహా సేనాయ ధీమహి తన్నో : షణ్ముఖ ప్రచోదయాత్ ॥

1. యంత్రమును 5'' x 5'' సైజు రాగి, లేక వెండి రేకు మీద అక్షర రూపమున నిర్మించవలయును.

**యంత్ర పూజా విధి :-** యధావిధిగా, యంత్ర నిర్మాణమైన పిదప, యంత్ర సంస్కారములు, ప్రాణప్రతిష్ట గావించి, నియమ, నిష్ఠలతో 40 రోజులు అనగా మండలము రోజులు శాస్త్రోక్తముగా పూజించాలి మూల మంత్రమును రోజుకు 216 పర్యాయములు జపించవలయును. జపమునకు - నాగముష్టి, నాగమల్లి పూసల మాలతో జపించవలెను.

పిదప, నాగమల్లి, నాగముష్టి పుల్లలతో ఒకే రోజున హోమమును 216 మార్లు చేయవలెను. ఆఖరి రోజన కూడ చేయవచ్చును.

చివరి రోజున 6 గురు బాలురకు భోజన, వస్త్రాదులు సమర్పించి పూజించవలయును.

**సూచన :-** ఈ యంత్ర పూజాదులకు "దీక్ష" చాలా ముఖ్యమైనది. ఎంతటి కఠోరమైన దీక్ష నవలంబించిన అంత శుభ పలముల నొందగలము. భూశయనము, బ్రహ్మచర్యము, ఉపవాసము చాల ముఖ్యమైన నియమములు. ఎట్టి పరిస్థితులలోను మంచము మీద కూర్చోనుటగాని, పరుండుటగాని చేయ కూడదు.

**ఫలము :-** సంతాన ప్రాప్తి, నాగ దోష నివారణము ఋణ విమోచనము, గర్భాశయ దోషాదులు నివారణ యగును. కుజ గ్రహ దోష నివారణ యగును.



# 3. సకల విద్యా గణపతి యంత్రము



**మంత్రము :-** 1. ఓం గం గణపతయే నమః !

2. ఓం హ్రీం శ్రీం గం గణపతయే స్వాహా !!

**గాయత్రి :-** ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నోదంతిః ప్రచోదయాత్ !

గణపతి - సర్వదేవతా స్వరూపుడు, విద్యా దాత. అందువలన ఈ యంత్రితమును రాగి రేకుపై లిఖించుకొని సర్వసంస్కారములు. జరిపి, శుభము హూర్తమున పూజామందిరము నందుంచుకొని, నిత్య పూజాదికములు జరుపుచున్న ఎడల సర్వవిద్యాభివృద్ధి, సర్వకార్యము లందు విజయము. కుటుంబ అభివృద్ధి కల్గును.

**పూజ :-** ముందు చెప్పిన మంత్రములతో ఏదైన ఒక మంత్రమును నిత్యము 108 సార్లు జపించవలెను. రోజు ఒకసారి 108 తెల్లజిల్లేడు కర్రలతో హోమము చేయవలెను. కానిచో " రాగి ఫలముల" తో నైనను హోమము చేయవచ్చును.

**సూచన :-** ఈ పూజాది కార్యక్రమములు స్త్రీ, పురుషులు ఎవరికి వారు మాత్రమే చేసుకొనవలెను.

**ఫలము :-** సర్వ కార్య విఘ్న నివారణ, విజయము మనోవాంఛ ఫల సిద్ధి, సకల విద్యాభివృద్ధి, అన్ని విధముల శుభ ఫల దాయిని





# విద్యా గణపతి

# 4. శ్రీసాయి బాబా యంత్రము



మంత్రము :- ఓం తత్పురుషాయ విద్మహే అవధూతాయ ధీమహి తన్నోస్సాయీ ప్రచోదయాత్ !!

(2) ఓం హంస హంసాయ విద్మహే పరమ హంసాయ ధీమహి తన్నో హంస ప్రచోదయాత్ ! సర్వభక్త జనాన్ రక్ష రక్ష ఆయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధి పూరక మనోవాంఛాన్ పూరయ పూరయ !!

(3) ఓం షిర్డి వాసాయ విద్మ హే ! దేవ రూపాయ. ధీమహి తన్నోసాయిః ప్రచోదయాత్ !!

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును సశాస్త్రీయముగా నిర్మాణము గావించవలెను. రాగిరేకు మీద లిఖించవలయును సమస్త సంస్కార విధులను నిర్వహించి, ప్రాణ ప్రతిష్ఠ గావించి - పూజమందిరము నందుంచి, ఒక మండలము అనగా 40 రోజులు పరిపూర్ణమైన విశ్వాసముతో దీక్షతో పూజాదులు నిర్వహించవలయును.

**పూజ విధానము :-** యంత్రమునకు ప్రతినిత్యము పంచామృత అభిషేకము, పూజ, ముందు తెల్పిన మంత్రమును 108 సార్లు జపించవలయును. ఈ విధంగా 40 రోజులు జరుపవలయును. ప్రతి రోజు తులసి కర్రలతోను, ఆవు నేయి, హోమ చూర్ణముతో - మూల మంత్రమును జపించుచూ హోమము చేయవలెను. ప్రతి నిత్యము " గురు చరిత్ర'' గ్రంధమును ఒక అధ్యాయము - ఉదయము, సాయంత్రము పారాయణ చేయవలయును. ఈ విధి విధానమంతయు సద్గురు సాయి నాథుని ప్రేరణగా భక్తి విశ్వాసములతో చేయవలయును. ఇది ఎంతయో అత్యంతావశ్యకము. మనసునందు సద్భావన ముఖ్యము. బాబా యొక్క కృపాకటాక్షములకై ప్రార్థించవలయును. నిష్కామముగా ఈ కార్యచరణ సాగించవలెను. ఇదియే సాయికృపకు పరిపూర్ణ తత్వమని మనవి చేయు చున్నాము.

**ఫలము :-** ఈ యంత్ర పూజాదికములచే ఫలతములు అనుభవ యోగ్యములే కాని, వివరింపనలవి గాదు. ముఖ్యముగా సర్వకార్యసిద్ధి, సుఖదుఃఖముల నుండి విముక్తి, ధనప్రాప్తి, సర్వార్ధ సిద్ధి, సమకూరును. మనసు బాబా పై గల భక్తి, విశ్వాసములే, ఫలితములు పొందుటకు గీటురాయి.

### ధ్యాన శ్లోకము

శ్లో ॥ సదాసత్ స్వరూపం చిదానంద కందం
జగత్ సంభవ స్థాన సంహార హేతుం,
స్వభక్తే చ్ఛయామానుషం దర్శయంతం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథం ॥

ఓం శ్రీ సాయినాథాయ నమః



# 5. శ్రీగురు దత్తాత్రేయ యంత్రము




మూల మంత్రము :-

(1) ఓం హ్రాం హ్రీం హ్రూం శ్రీ గురు దత్తాత్రేయాయ నమ :

(2) ఓం దం దాం దీం దూం దైం హే త్రిమూర్తి స్వరూపాయ: దత్తాత్రేయాయ, స్మరణ మాత్ర సంతుష్టాయ, సర్వకర్మాణి సాధయ, సాధయ సదానుగ్రహం భవ భవ విద్యా రహస్యాదీన్ జ్ఞాపయ హుం ఫట్ స్వాహా !

**యంత్ర నిర్మాణము :-** యంత్రమును శాస్త్రోక్తముగా, రాగి లేక వెండి రేకు మీద తయారు చేయించు కొనవలెను. రేకు 5" x 5" యొక్క కొలతలో ఉండవలయును. పిదప యంత్రమునకు సమస్త సంస్కారములు జరిపి యంత్రమును దోష రహితము గావించి, పిదప ప్రాణ ప్రతిష్ట చేసి పూజ యందుంచవలెను. ఇవి అన్నియు తారాబల, చంద్రబల యుక్తమైన శుభ ముహూర్తమున చేయవలెను.

**పూజా విధి :-** ఈ యంత్రమును 40 రోజులు నియమ, నిష్టలతోను, నిర్దిష్టమైన దీక్షతోను పూజాదికములు నిర్వహించవలెను. ప్రతిరోజు గురుదేవుల మూలమంత్రమును 216 సార్లు జపించి, పంచ పూజలు నిర్వహించవలయును. చివరిరోజున, అనగా 40 వ రోజున మాత్రము జువ్వి, బ్రహ్మమేడి, రావి సమిధలతో - మూల మంత్ర సహితముగా హోమము నిర్వహించవలెను. హోమము కొరకు చతురస్త్ర హోమకుండమును ఉపయోగించాలి. ఆవునేతిని వాడాలి. పిదప బ్రాహ్మణులకు, సాధువులకు సంతర్పణ శక్తి మేర జరపాలి. పిదప యంత్రమును గృహమునందు పూజా మందిరము నందుంచి నిత్య పూజ జరుపవలెను. ఇది చాలా శక్తి వంతమైన యంత్రము, కావున దీక్ష చాలా అవసరము. 40 రోజులున్నూ బ్రహ్మ చర్యము, భూశయనము, ఉపవాస దీక్షలను పాటించవలెను.

**ఫలము :-** దైవశక్తి నిగుఢీకృత మగును. వాక్శుద్ధి కల్గును. భూగృహ భాగ్యాదులు లభించును. ఇష్ట కార్యసిద్ధి, ధన లాభము కలుగును. గాలి దోషములు తొలగును. ఇంటి యందుండు భూత, పిశాచ బాధ నివృత్తి యగును. నరఘోష తొలగును. ఇది కుటుంబమునకంతకును "సర్వరక్ష" గా నిలుచును.

శ్లో ॥ నమస్తే భగవన్ దేవ దత్తాత్రేయ జగత్ప్రభో
నరబాధా ప్రశమనం కురు శాంతిం ప్రయచ్ఛమే ॥

శ్లో ॥ అఖండ మండలాకారం । వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన । తస్మై: శ్రీగురువేనమః ॥

శ్రీ గురు చరణారవిందార్పణమస్తు
ఓం శాంతిః శాంతిః శాంతిః



# ౬. శ్రీ బాలా త్రిపుర సుందరి యంత్రము



**మూల మంత్రము :-**

(1) ఓం కవి ఈలహ్రీం, హసకహల హ్రీం, సకలహ్రీం, హే బాల రూపిణీ । అణిమాది అష్టసిద్ధిం బోధయ భోధయ మహాధైర్యం దేహి దేహి పుత్ర పౌత్రాది వృద్ధిం కురు, కురు స్వాహా !

(2) ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః శ్రీ త్రిపుర బాల సుందరి దేవ్యై నమః ।

# శ్రీ బాల త్రిపుర సుందరీ ధ్యానము

శ్లో ॥ హ్రీంకారాసన గర్భితానలశిఖాం సౌః క్లీం కళాం బిభ్రతీం
సౌవర్ణాంబర ధారిణీం వరసుధా ధౌతాం త్రినేత్రోజ్జ్వలాం
వందే పుస్తక పాశ మంకుశధరాం స్రగ్భూషితాం ముజ్జ్వలాం
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పర కళాం శ్రీ చక్ర సంచారిణీమ్ ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును 5''.x 5'' కొలతగల రాగి లేక వెండి రేకు మీద, దైవజ్ఞులచే నిర్మింపచేసుకొనవలెను. వారి యొక్క నక్షత్రరీత్యా శుభ ముహూర్త, శుభ లగ్నము లందు యంత్ర సంస్కారములు, ప్రాణ ప్రతిష్ట గావింపవలెను. పిదప గృహము నందు గల పూజా మందిరము నందుంచి పూజింపవలయును.

**పూజా విధి :-** యంత్రమును మండలము (40) రోజులు - మూల మంత్రమును నిత్యము 216 సార్లు జపించి, పూజాదులు శ్రీ సూక్త విధానమున నిర్వహింపవలయును. దీక్షగా నుండవలయును. నియమ, నిష్ఠలు పాటించవలెను. ప్రతి దినము బెల్లముతో చేసిన అన్నపు పాయసమును నివేదించవలయును. దేవీ నవరాత్రులను ఎంత దీక్షగా నిర్వహించెదమో, అంతే దీక్షతో ఈ యంత్ర పూజలను 40 రోజులు జరుపవలెను.

చివరి రోజున - చతురస్రాకార హోమ కుండము నందు - మామిడి, రావి, హోమ చూర్ణ ద్రవ్యములతోను, ఆవు నేతితోను - మూలామంత్ర జప సహితముగా 516 సార్లు హోమము చేయవలెను. పిదప బ్రాహ్మణులకు దాన సంతర్పణాదులు చేయవలెను. పిదప యంత్రమును నిత్య పూజా మందిరము నందుంచి మూల మంత్ర సహితముగా కుంకుమార్చన జరుప చుండవలెను.

**ఫలము :-** సర్వదోష నివారణమగును. బాలాంబ యొక్క దివ్యాను గ్రహము కల్గి కుటుంబాది వ్యవహారములు అన్ని వేళల సానుకూలమై కార్య సిద్ధి కల్గును. వ్యవహార జయము చేకూరును. శత్రునాశనము కల్గును. ఆ తల్లి యొక్క కృపతో అమోఘమైన వాక్సుద్ధి కల్గును. సర్వకాల సర్వావస్థల యందును "శ్రీ" రక్షగా నిలుచును. మాత చరణములందే పరిపూర్ణ దృష్టితో సేవించిన వారికి ఇహలోక సర్వ ఆయుర్భాగ్యములు, స్త్రీలకు అఖండ సౌభాగ్య యోగమును కల్గును.

"ఓం శ్రీ లోకమాత్రే నమః"



# 7. సూర్య గ్రహ యంత్రము



**మూల మంత్రము :-**

(1) ఓం హ్రాం హ్రీం హ్రోం సః బీజాక్షర రూప సూర్య గ్రహాయ, మమ సర్వ కర్మాణి సాధయ సాధయ, సర్వరోగాన్ నివారయ నివారయ - మనో ధైర్యం దేహి దేహి.

(2) ఓం హ్రీం తిగ్మరశ్మయే ఆరోగ్య దాయ స్వాహా ।

(3) ఓం హ్రాం హ్రీం సః సూర్యాయ నమః

**యంత్ర నిర్మాణము :-** యంత్రమును - వెండి లేక రాగి రేకు మీద 5" x 5" సైజులో దైవజ్ఞులచే తయారు చేయించుకొనవలయును. లేక ధారణ యంత్రముగానైనను అక్షర రూపమున చేయించుకొనవలయును.

**లఘు పూజ :-** ఈ యంత్రమును ఒక శుభ ముహూర్తమున ఆదివారము నాడు, దేవాలయమునందుగాని, గృహము నందలి పూజా మందిరము నందు గాని ఉంచి పూజాదులు నిర్వహించాలి.

ముందుగా యంత్రమును పంచామృతములతో గాని, కొబ్బరి నీటితో గాని లేని యెడల మంచినీటితో గాని అభిషేకించి - పసుపు, కుంకుమలతో అలంకరించవలయును. పిదప అష్టోత్తరనామ పూజ, మూల మంత్ర జపమును **108** పర్యాయములు జపించవలెను. ముందు తెల్పిన మూల మంత్రములలో ఏదో ఒక దానిని మాత్రమే నిత్యము జపించాలి. ఈ విధముగా **40** రోజులు చేయవలెను. యధాశక్తిగా ధూప, దీప నైవేద్యములను సమర్పించవలెను. ఈ పూజాదికములు రోజుకు ఒక్క పర్యాయము చేసిన చాలును.

**ఫలము :-** జన్మ కుండలి యందు - రవి గ్రహము బలహీనము గా ఉండి - రవి మహర్దశ, అంతర్దశ జరుగుచున్నవారు, అనారోగ్య నివారణకు, మానసిక శాంతికి, అభివృద్ధికి, కుడి కంటి దోషము పోవుటకు, గుండె జబ్బుల నివారణకు, మనో ధైర్యమునకు, గోచార రీత్యా రవిగ్రహము దుస్థానములందున్న సమయమున రవిగ్రహ ప్రీత్యర్ధముగా పూజాదులు నిర్వహించవలయును. మహర్దశ జరుగుచున్నవారు ధారాణా యంత్రముగా ధరించవచ్చును.

40 వ రోజున పూజా నిర్మాల్యాదులను ప్రవహించుచున్న నదిలో గాని, కాలువలో గాని కలుపవలయును.

## రవి గ్రహ ధ్యానము

ద్విభుజం పద్మహస్తంచ । వందం మకుటాన్వితం ।
ధ్యాయేద్దివాకరం దేవం । సర్వాభీష్ట ప్రదాయకం ॥

## సూర్య గాయత్రీ మంత్రము

భాస్కరాయ విద్మహే మహోర్ద్యుతి కరాయ ధీమహి ।
తన్నోః ఆదిత్య ప్రచోదయాత్ ॥

★★★★★

# 8. చంద్ర గ్రహ యంత్రము



**మూల మంత్రము :-**

(1) ఓం ఐం క్లీం సోమాయ నమః

(2) ఓం క్లీం శ్రీం హ్రీం ఐం అమృత కరామృతం ప్లావయ స్వాహా ।

(3) ఓం శ్రాం శ్రీం శ్రూం సః బీజాక్షర రూపేణ చంద్ర గ్రహాయ, మమకుటుంబే సర్వకార్యాభివృద్ధిం దేహి దేహి స్వాహా ।

# చంద్రగ్రహ ధ్యానము

జటాధరశిరోరత్నం । శ్వేత వర్ణం నిశాకరం ।
ధ్యాయే దమృత సంభూతం । సర్వకామ ఫలప్రదం ॥

**యంత్ర నిర్మాణము :-** యంత్రమును - రాగి లేక వెండి రేకు మీద అక్షర రూపమున దైవజ్ఞులచే తయారుచేయించుకొనవలెను. శుభలగ్న, శుభముహూర్తాదులందు గృహమున పూజాస్థానమునందుంచి - 40 రోజులు పూజించవలెను.

**పూజాది విధానము :-** ఎవరి జన్మ జాతకమునందైన చంద్ర గ్రహము - దుస్థానములందుగాని, అరిష్ఠ స్థానము లందుగాని ఉండి చంద్ర బలము లేక, చంద్రగ్రహ మహర్దశ, అంతర్దశలు నడచుచున్నవారు - మానసిక శాంతికి, చంద్రగ్రహ దోష నివారణకు ఈ యంత్రారాధన చేయవచ్చును.

యంత్రమునకు పంచామృత స్నాములర్పించి - పసుపు, కుంకుమ, గంధములతో నలంకరించి - మూలమంత్రముతో యంత్రమును పూజించవలెను (108 పర్యాయములు) పిదప అష్టోత్తరశతనామ పూజ జరుపవలెను. యధాశక్తి ధూప, దీప, నైవేద్యాదులను సమర్పించవలెను. ఇది లఘు పూజా విధానము రోజు ఒక్కసారి మాత్రము చేయాలి.

**ఫలము :-** చంద్రగ్రహ దుష్ట స్థాన దోష నివృత్తి, మానసిక శాంతి, కుటుంబ అభివృద్ధి. పుత్ర, పుత్రికా కార్య జయము ధనప్రాప్తి. మాతృసౌఖ్యము. ఉదర వ్యాధి నివారణ స్వ్చారణ. యశస్సు. సుఖ సంతోషాదులు చేకూరును.

## ధ్యానము

దధి శంఖ తుషారాభం । క్షీరార్ణవ సముద్భవం ।
నమామి శశినం సోమం । శంభోర్మకుట భూషణం ॥

**గమనిక :-** మండలము పూజ పూర్తియైన పిమ్మట - పూజ నిర్మాల్యం - నదిలోగాని, కాలువయందుగాని కలుపవలెను.



# ౩. కుజ (అంగారక) గ్రహ యంత్రము



**మూల మంత్రము :-**

(1) ఓం ఐం హౌం శ్రీం ద్రాం కం గ్రహాధి పతయే భౌమాయ స్వాహా !

(2) ఓం క్రాం క్రీం క్రూం సః బీజాక్షర రూపాయ కుజ గ్రహాయ మమ కుటుంబ, వ్యాపారస్థలే ఋణాన్ నివృత్తయ, నివృత్తయ ధన వృద్ధి దేహి దేహి ఫట్ స్వాహా.

# కుజ గ్రహ ధ్యానము

రక్త మాల్యాంబర ధరం । మేషారూఢం చతుర్భుజం ।
శక్తి శూల గదా పద్మాన్ । ధారయం తం కరాంబు జైః ॥

**యంత్ర నిర్మాణము :-** యంత్రమును -5" x 5" సైజు గల రాగి లేక వెండి రేకు మీదగాని లేనిచో ధారణా యంత్రముగా గాని అక్షర రూపమున దైవజ్ఞులచే తయారు చేయించుకోవలెను. పిదప ఒక సుముహూర్తమున పూజాదికములను ప్రారంభించవలెను. అదియును ప్రారంభము మంగళవారమునాడు మాత్రమే చేయవలయును.

**లఘు పూజా విధి :-** యంత్రమును 40 రోజులు దీక్షతో పూజించవలయును. ప్రతినిత్యము యంత్రమును - మూలమంత్ర జపముతో 108 మార్లు పూజించవలెను. అటు పిమ్మట అష్టోత్తరశతనామ పూజ నిర్వహించి శక్తి మేర ధూప, దీప, నైవేద్యాదులను సమర్పించవలెను. యంత్రమును - కుంకుమ, అక్షతలు, ఎర్రని పూలతోను పూజించవలయును.

**ఫలము :-** జాతకరీత్యా - కుజగ్రహము దుష్ట స్థానములందుండి అట్టి కుజదశ జరుగుచున్నవారు - కుజగ్రహ దోష నివారణార్థము యంత్రమును పూజించినచో - తత్ గ్రహ దోష నివారణమగుటయే గాక, ఋణ బాధలనుండి, శత్రువుల నుండి సత్వర విముక్తి కల్గి, సంకల్ప సిద్ధి కల్గును. ఆయుధ మూలక భయము నశించును, ధైర్య వృద్ధి చేకూరును - వివాహ దోషములు నివారణమగును. ఉష్ణము, పిత్తము, వ్రణముల వల్ల కల్గు అనారోగ్యము నశించి ఆరోగ్యాభివృద్ధి కల్గును. గోచారరీత్యా కుజ దోష నివారణకు కూడా యుక్తమైనది. కుజ మహార్దశ జరుగుచున్నవారు ఈ యంత్రమును రక్ష రేకుగా ధారణ చేయవచ్చును.

## ధ్యానము

ధరణీ గర్భ సంభూతం । విద్యుత్కాంతి సమప్రభం ।
కుమారం శక్తి హస్తం । తం మంగళం ప్రణమామ్యహం ॥

**గమనిక :-** 40 రోజుల పూజానంతరము నిర్మాల్యమును ప్రవహించునది యందు గాని, కాలువ యందుగాని విడువవలెను.

ఓం శరవణ భవాయ నమః



# 10. బుధ గ్రహ యంత్రము



**మూల మంత్రము :-**

(1) ఓం ప్రాం క్రోం జం గ్రహనాథాయ బుధాయ స్వాహా !

(2) ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బీజాక్షర రూపేణ బుధ గ్రహాయ మమ వృత్తి వ్యాపారే ధనవృద్ధిందేహి ఫట్ స్వాహా !

(3) ఓం ఐం స్త్రీం బుధాయ నమః

## బుధగ్రహ ధ్యానము

సింహారూఢం చతుర్భుజం । ఖడ్గ చర్మ గదాధరం ।
సోమపుత్రం మహా సౌమ్యం । ధ్యాయేత్ సర్వార్థ సిద్ధిదం ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ బుధ యంత్రమును - రాగి లేక వెండి రేకు 5" x 5" సైజు గల దానిపై దైవజ్ఞులచే తయారు చేయించుకొని - బుధవారము రోజున శుభముహూర్తములో గృహమునందు పూజాస్థలము నందుంచి 40 రోజులు పూజించవలయును.

**లఘు పూజావిధి :-** ఈ యంత్రమును లిఖించిన పిమ్మట పంచామృతములతో గాని, పాలతోగాని, కొబ్బరి నీళ్ళతో గాని అభిషేకించి, పసుపు, కుంకుమ, పుష్పములతో అలంకరించి - ప్రతి నిత్యము అష్టోత్తరశతనామ పూజ జరుపుచూ, మూల మంత్రములలో ఒక దానిని నిత్యము 108 సార్లు జపించుచూ యంత్రము మీద పుష్పాక్షతలను ఉంచవలెను. ప్రతినిత్యము, జప, పూజాదికముల అనంతరము యధాశక్తి ధూప, దీప, నైవేద్యములు ఇవ్వవలెను. ఈ నలుబది రోజులు నియమములు పాటించవలయును.

**గమనిక :-** 40 రోజుల అనంతరము పూజా నిర్మాల్యము నదిలో వదలవలెను.

**ఫలము :-** ఎవరిజాతకమందు బుధ గ్రహము బలహీనముగా నుండి, బుధ మహర్దశ జరుగుచున్నవారు, ఏ దశయందైన బుధ అంతర్దశ జరుగుచున్నవారు ఈ యంత్రమును పూజించవలయును. తత్ఫలితముగా బుధ గ్రహ దోషము తొలగి సర్వ విధముల వృత్తి, వ్యాపారములందు అభివృద్ధి నొందగలరు. కీర్తి మంతులగుదురు. విశేష సంపద కలుగును. జ్ఞానాభివృద్ధి చేకూరును. దాయాదుల మూలమున బాధలు ఉపశమించును. కంఠము, నాభి, గుహ్యము, ఎడమ చెవికి సంబంధించిన వ్యాధులు తగ్గును. బుద్ధి వికాసము కలిగి విద్యార్థులు ఉన్నత స్థితి నొందగలరు.

బుధ మహాదశ (17 సం॥లు ) జరుగుచున్నవారు ఈ యంత్రమును రక్ష రేకుగా చేయించుకొని ధారణ చేయవచ్చును.

## ధ్యానము

ప్రియంగు కళికాశ్యామం । రూపేణ ప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సత్త్వగుణోపేతం । తం బుధం ప్రణమామ్యహం

ఓం శాంతిః



# 11. గురుగ్రహ యంత్రము




మూల మంత్రము :-

(1) ఓం హ్రీం శ్రీం బ్లీం ఐం గ్లాం గ్రహాధిపతయే । బృహస్పతమే వీం ఠం శ్రీం ఠః ఐం ఠః స్వాహా ॥

(2) ఓం హ్రాం హ్రీం హ్రౌం సః బీజాక్షర రూపేణ గురు గ్రహాయ, మమకుటుంబే పుత్ర పౌత్రాది, సంపదాది వృద్ధిం కురు కురు స్వాహా !

(3) ఓం ఐం క్లీం - బృహస్పతయే నమః

# గురుగ్రహ ధ్యానము

వరాక్షర మాలాం దండంచ కమండలు ధరం విభుం ।
పుష్పరాగాంకితం పీతం వరదం భావయేద్గురుం ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - రాగి లేక వెండి రేకు మీద (5" x 5") ధారణకొరకు రక్ష రేకు మీద దైవజ్ఞులచే యంత్ర నిర్మాణం అక్షర రూపమునగావించుకుని, గురువారము నాడు తారాబల, చంద్రబలయుక్తమైన శుభముహూర్తమున గృహమునందు పూజామందిరమునందుంచి 40 రోజులు దీక్షతో పూజించవలయును. ఎవరికి వారు చేసుకున్న చాలామంచిది.

**లఘు పూజ :-** యంత్రమునకు ప్రాణ పతిష్టాది విధులు నిర్వర్తించిన పిదప పంచామృతాభిషేకము గావించి, మూలమంత్రములలో నొక దానిని నిత్యము 108 సార్లు జపించుచు యంత్రము మీద కుంకుమ, పువ్వులు, అక్షితలు ఉంచవలయును. పిదప అష్టోత్తర శతనామ పూజ జరిపి యథాశక్తి ధూప దీప నైవేద్యములు సమర్పించవలెను. ఈ విధముగా 40 రోజులు రోజుకు ఒకసారి మాత్రము చేయవలయును. చివరిరోజున పూజ నిర్మాల్యమును నదిలో గాని, కాలువలో గాని వదలవలెను.

**ఫలము :-** ప్రతి వారి జీవితమందు గురుమహార్దశ 16 సం॥లు. అట్టి గురుడు - జాతకమునందు బలహీనుడై దుష్టస్థానములందున్నవారు, ఏ మహర్దశ యందైన గురు అంతర్దశ జరుగుచున్నవారు - ఈ యంత్రమును పూజించి గురుగ్రహ దోషము పరిహారము చేసుకొని శుభములను పొందగలరు. దీని వలన గౌరవాభివృద్ధి, సంఘమునందు పేరు ప్రఖ్యాతులు, ధన ధాన్యవృద్ధి, కలుగును. గురుడు విద్యాకారకుడు - కనుక విద్యార్థులు అత్యున్నత శ్రేణి ఉత్తమ ఫలితములను పొందగలరు. గోచారరీత్యా గురుబలములేని వారు కూడా పూజించి సత్ఫలితములను పొందవచ్చును. గృహ సౌఖ్యము కల్గును. బుద్ధిమాంద్యము నశించును. సర్వ శుభములు చేకూరును.

## ధ్యానము

దేవానాంచ ఋషీణాంచ - గురుంకాంచనసన్నిభమ్
బుద్ధిమంతం త్రిలోకేశం - తన్నమామి బృహస్పతిమ్ ॥

ఓం శాంతి ః



# ౧౨. శుక్రగ్రహ యంత్రము



మూల మంత్రము :-

(1) ఓం శాం శీం శూం దైత్య గురో సర్వాన్ కామాన్ పూరయ పూరయ స్వాహా !

(2) ఓం ద్రాం ద్రీం ద్రౌం స: బీజాక్షర రూపేణ శుక్ర గ్రహాయ మమ గృహే వ్యాపారే ధనం ప్రసీద ప్రసీద ఫట్ స్వాహా !

(3) ఓం హ్రీం శ్రీం శుక్రాయ నమః

# శుక్రగ్రహ ధ్యానము

జటిలం సాక్ష సూత్రంచ । వరదండ కమండలుం ।
శ్వేత వస్త్రావృతం శుక్రం । ధ్యాయే ద్దానవ పూజితం ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును -(5'' x 5'') సైజు గల వెండి లేక రాగి రేకు మీద దైవజ్ఞులచే తయారు చేయించుకొనవలెను. రక్షరేకుగా కూడా చేయించుకొనవచ్చును. యంత్రము తయారైన పిదప, శుక్రవారము రోజున, తారాబల, చంద్రబల యుక్త శుభ ముహూర్తమున గృహము నందు పూజా స్థానమందుంచి 40 రోజులు దీక్షగా పూజించవలయును. యంత్ర సంస్కార, ప్రాణ ప్రతిష్టాదులు గావించవలయును.

**లఘు పూజా విధి :-** యంత్రమునకు పంచామృత అభిషేకము చేసి, మూల మంత్రమును ఒక దానిని నిత్యము 108 సార్లు జపించుచు యంత్రముపై పుష్పములు, కుంకుమ అక్షతలు ఉంచవలెను. (మంత్రము 108 సార్లు జపించవలెను) పిదప నిత్యము అష్టోత్తర శతనామ పూజ జరిపి యధాశక్తి ధూప, దీప, నైవేద్యము లర్పించవలెను. 40 రోజులు దీక్షతో పూజాదికములు పూర్తయిన పిమ్మట పూజా నిర్మాల్యమును నది లేక కాలువలో వదులవలెను.

**ఫలము :-** జాతకమునందు శుక్రగ్రహము బలహీనపడి, దుష్టస్థానములందుండి, శుక్రదశ లేక అంతర్దశ జరుగుచున్నవారందరు ఈ యంత్రమును పూజించి శుక్రగ్రహ దుష్ట స్థానస్థితి దోషములను పరిహారము చేసుకొనవచ్చును. దీని వలన వివాహ యోగములు సానుకూలమగును. అన్యోన్య దాంపత్య జీవితము. దాంపత్య సుఖము చేకూరును. కళల యందు అభివృద్ధి, ఐశ్వర్యాభివృద్ధి కల్గును. గర్భకోశ వ్యాధులు నివారణ యగును. శుక్రుడు కళత్ర కారకుడు కావున వివాహ, దాంపత్య సంబంధిత విషయములన్నిటి యందు సానుకూల ఫలితములు కల్గును. శుక్రమహర్దశ 20 సం॥లు గాన, బలహీనమైన శుక్రదశ జరుగుచున్నవారు ఈ యంత్రమును ధారణ చేయవచ్చును.

## ధ్యానము

హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమమ్ గురుమ్ ।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం ॥

*ఓం శాంతిః*

★★★★★

# 13. శనిగ్రహ యంత్రము



మూల మంత్రము :-

(1) ఓం హ్రీం శ్రీం గ్రహ చక్రవర్తినే శనైశ్చరాయ క్లీం ఐం సః స్వాహా ।

(2) ఓం ఖ్రాం ఖ్రీం ఖ్రౌం సః శని గ్రహాయ మమ శరీరే సర్వరోగాన్ దాపయ దాపయ ఆయురారోగ్యాది ధనవృద్ధిం దేహి దేహి ఫట్ స్వాహా !

(3) ఓం ఐం హ్రీం శ్రీం శనైశ్చరాయ నమః

# శనిగ్రహ ధ్యానము

నీలాంబరో నీలవపుః కిరీటి గృధ్రస్థిత స్త్రాసకరో ధనుష్మాన్ ।
చతుర్భుజ సూర్యసుతః ప్రశాంతస్సదాస్తు మహ్యం వరదః ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల వెండి లేక రాగి రేకు మీద దైవజ్ఞులతో తయారు చేయించుకొని - శనివారము నాడు మాత్రమే - గృహమునందలి పూజాస్థానము నందుంచి 40 రోజులు పూజ, జపాదులు నిర్వహించవలయును. ఇదే యంత్రమును ధారణ కొరకు రక్ష రేకుపైన కూడా లిఖించుకొనవచ్చును, యంత్ర సంస్కారము, ప్రాణ ప్రతిష్ఠ జరిపిన మీదకు పూజాదులు ప్రారంభించవలెను.

**లఘు పూజావిధి :-** యంత్రమును ముందుగా పంచామృతములతో అభిషేకించి, పసుపు, కుంకుమ, గంధాదులతో అలంకరించవలయును. తర్వాత ప్రతిరోజు మూల మంత్రములలో ఒక మంత్రమును 108 పర్యాయములు జపించుచు యంత్రము మీద గంధ పుష్పాక్షతలు, కుంకుమ ఉంచవలయును. తర్వాత యంత్రమునకు శని ప్రీతి కొరకై అష్టోత్తర శతనామ పూజ జరిపి, యథాశక్తి ధూప, దీప, నైవేద్యములర్పించవలయును. ఈ విధంగా 40 రోజులు దీక్షతో అర్చించి, చివరి రోజున పూజా నిర్మాల్యమును ప్రవహించుచున్న నది యందు లేక కాలువ యందు వదులవలెను. పూజను ప్రతిరోజు ఒక్కసారి మాత్రము చేయాలి.

**ఫలము :-** జన్మలగ్నరీత్యా శని బలహీనుడైనను, దుష్టస్థానములందున్నను, గోచారారీత్యా ఏలిననాటి శని, అష్టమశని, అర్ధాష్టమ శని - జరుగుచున్నవారు - శని గ్రహ దోష నివారణకు, ప్రీతికి యంత్రమును పూజించాలి. ఇందు వలన అన్ని కష్టములు తొలగి పనులన్నియు సానుకూల మగును. అపమృత్యు దోషము నివారణ యగును. ఆరోగ్య పరిస్థితి మెరుగుపడును. మనోచాంచల్యము నశించును.

**గమనిక :-** శనిగ్రహ జపమును బ్రహ్మణులైన దైవజ్ఞుల చేతనే జరిపించుకోవలయును. స్వయముగా చేయరాదు.

## ధ్యానము

నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్ ।
ఛాయా మార్తాండ సంభూతం - తన్నమామి శనైశ్చరమ్ ॥

ఓం శాంతిః



# 14. రాహుగ్రహ యంత్రము



మూల మంత్రము :-

(1) ఓం ఐం హ్రీం రాహవే నమః

(2) ఓం భ్రాం భ్రీం భ్రౌం సః రాహు గ్రహాయ మమ వ్యాపారే ధన ధాన్యాది వృద్ధిం దేహి దేహి ఫట్ స్వాహా !

(3) ఓం కయానశ్చిత్ర ఆభువదూతీ సదా వృధస్సఖా । కయాశ చిష్టయా వృతా ॥

# రాహుగ్రహ ధ్యానము

కరాళవదనం ఖడ్గ చర్మ శూల వరాన్వితం ।
నీలసింహాసనం ధ్యాయే గ్రాహుం తంచ ప్రశాంతయే ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల వెండి లేక రాగి రేకు మీద, రక్ష రేకు మీద గాని యధా తధముగా దైవజ్ఞులచే తయారు చేయించుకోవలయును. యంత్ర సంస్కార, ప్రాణప్రతిష్ఠాదులు జరిపించుకోవలయును. ఇవి అన్నియు ఒక శుభ ముహూర్తమున చేయవలయును పిదప యంత్రమును పూజా స్థానమందుంచి గురువారం రోజున పూజాదులు ప్రారంభించవలయును. 40 రోజులు చేయవలెను. యంత్రమును పసుపు, కుంకుమ, గంధముతో అలంకరించాలి.

**లఘు పూజావిధి :-** యంత్రమునకు శాస్త్ర రీత్యా పంచామృత అభిషేకము జరిపి, మూలమంత్రములలో నొక దానిని 108 పర్యాయములు నిత్యము జపించుచు యంత్రము మీద పుష్పాక్షితలు, కుంకుమ ఉంచవలయును. తర్వాత అష్టోత్తర శతనామ పూజ జరిపి, యధాశక్తి ధూప, దీప, నైవేద్యాదులు అర్పించవలయును. ఈ విధంగా రోజుకు ఒకసారి చేయవలయును. దీక్షతో 40 రోజుల పూజ ముగిసిన పిమ్మట, పూజా నిర్మాల్యమును నదిలో కలుపవలెను.

మంత్రోచ్చారణ సస్వరముగా నుండవలెను. వీలుగానిచో బ్రాహ్మణులతో చేయించుకోవలయును.

**ఫలము :-** జాతక రీత్యా రాహు గ్రహ దుస్థాన దోష నివారణకు, రాహు మహర్దశ, అంతర్దశ జరుగుచ్నువారు, గోచార రీత్యా రాహువు దుస్థానములందున్న దోష నివారణకు ఈ యంత్రమును పూజించాలి. అవసరమైన పూజ పిదప యంత్రధారణ చేయవచ్చును.

దీని వలన - అనవసర ప్రయాణములు, వృత్తి ఉద్యోగాదులందు ఆటంకములు నివారణమగును. భూ, ఉద్యోగ లాభములు కల్గును. రాజ్య లాభము నీచజన సహవాసము నుండి బయట పడుట కల్గును. శ్వాస, కాస రోగముల నుండి ఉపశమనము చేకూరును.

# ప్రార్థన

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం
సింహికా గర్భ సంభూతం । తం రాహుం ప్రణమామ్యహమ్ ॥

*ఓం శాంతిః*

# 15. కేతుగ్రహ యంత్రము



**మూల మంత్రము :-**

(1) ఓం కేతుం కృణ్వన్నకేతవే పేశో మర్యా అపేశసే ।
సముషద్భిరజా యథాః ।

(2) ఓం ప్రాం ప్రీం ప్రౌం సః బీజాక్షర రూపేణ కేతు గ్రహాయ మమ శరీరే ధైర్య, దైవ శక్తి వృద్ధిం ప్రసీద ప్రసీద ఫట్ స్వాహా ।

# కేతుగ్రహ ధ్యానము

ధూమ్రవర్ణం ద్విబాహుంచ । కేతుంచ వికృతాననం ।
గృధ్రాసన గతం నిత్యం । ధ్యాయేత్సర్వ ఫలాప్తయే ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి లేక వెండి రేకు మీద గాని, లేదా రక్ష రేకుగా గాని దైవజ్ఞులతో చేయించుకొని యంత్ర సంస్కారములు జరిపించుకొని, శుభ ముహూర్తమున ప్రాణ ప్రతిష్ఠ గావించి గృహమునందు పూజాస్థానమందుంచి - 40 దినములు నియమ నిష్ఠలతో పూజింపవలయును. పూజను గురువారము నాడు మాత్రమే ప్రారంభించాలి.

**లఘు పూజావిధి :-** యంత్రమునకు పంచామృత అభిషేకము చేసి, పసుపు, గంధము, కుంకుమలతో నలంకరించవలెను. ప్రతిరోజు మూలమంత్రములలో ఒక దానిని 108 సార్లు జపించుచు యంత్రము మీద పుష్పాక్షతలను, కుంకుమను ఉంచవలెను. తర్వాత అష్టోత్తర శతనామ పూజ జరిపి యధాశక్తి ధూప, దీప, నైవేద్యాదులు అర్పించవలెను.

40 రోజులు ముగిసిన పిదప, పూజా నిర్మాల్యమును నదిలో కలుపవలెను. మంత్రములను స్వచ్ఛముగా ఉచ్ఛారణ చేయవలయును. బ్రాహ్మణులతో కూడా జరిపించుకొనవచ్చును.

**ఫలము :-** జాతక రీత్యా కేతు గ్రహ దుస్థాన దోష నివారణకు, కేతు మహార్దశ అంతర్దశలు జరుగుచున్నవారు, గోచారరీత్యా కేతువు బలహీనముగా నుండి దుష్ఫలితముల నిచ్చునపుడు, తత్ దోష నిరారణార్ధము ఎల్లరును పూజించాలి. ఇందుచే, ఇష్ట దైవ కృపచే ధన ధాన్య వృద్ధి కల్గును. దైవచింతన పెంపొందును. శుభ కార్యనిర్వహణ, ఐశ్వర్య ప్రాప్తి, వేదాంత జ్ఞానాభివృద్ధి కల్గును. మనోచాంచల్యము నివారణ జరుగును. భోగ భాగ్యములు అనుభవించుట జరుగును శూల, స్ఫోటకము, విషూచి, వ్రణముల వంటి రోగముల నుండి విముక్తి కలిగి ఆరోగ్య వంతులగుదురు.

## ధ్యానము

ఫలాశపుష్ప సంకాశం । తారకా గ్రహ మస్తకం
రౌద్రం రుద్రాత్మకం ఘోరం । తం కేతుం ప్రణమామ్యహమ్ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః



# 16. వాస్తు పురుష యంత్రము



మూల మంత్రము :-

(1) ఓం వాం వీం వూం సః వాస్తు పురుషాయ మమ గృహే వ్యాపారస్థలే స్థల శుద్ధిం కురు కురు అఖిల భోగభాగ్యాది కంచ శీఘ్రమే ప్రాపయ ప్రాపయ ఫట్ స్వాహా !

(2) ఓం హ్రీం నమో వాస్తధీశ్వర బ్రహ్మణే । సమస్త వాస్తు దోషాన్నాశయ నాశయ । సుఖ మారోగ్యైశ్వర్య ప్రజా వృద్ధిమ్ కురుకురు స్వాహా ।

భూమిని "వాస్తువు" అని అందురు. అట్టి భూమి మీద నిర్మించబడిన వివిధ నిర్మాణములకు అధిపతి వాస్తు బ్రహ్మ. ఈయన అనుగ్రహమునకై వాస్తు బ్రహ్మను పూజించి మాత్రమే నిర్మాణములకు సన్నిద్ధము కావలెను.

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి రేకు మీదన లిఖించి, సర్వ విధ సంస్కారములు, ప్రాణ ప్రతిష్ట , జీవకళాన్యాసములను జరిపించి, ముందు తెల్పిన మంత్రములలో నొక దానిని ప్రతి నిత్యము 108 సార్లు జపించుచు, యంత్రముపై పుష్పాక్షతల నుంచి పూజించవలయును. ఈ విధముగా 40 రోజులు చేయవలెను. పూజ రోజునకు ఒక్కసారి మాత్రమే చేయవలెను. యధాశక్తి ధూప, దీప, నైవేద్యాదు లర్పించవలెను.

" అస్య శ్రీ వాస్తధీశ్వర బ్రహ్మణ మహా మంత్రస్య । బ్రహ్మఋషి । గాయత్రీ ఛందః । వాస్తధీశ్వర బ్రహ్మణోదేవతా । హ్రీం బీజమ్ । స్వాహా శక్తిః । నమః ఇతికీలకమ్ సర్వ వాస్తు దోష నివారణార్ధే జపే వినియోగః" అని చెప్పుకుని జపమాచరించవలయును.

**ఫలము :-** సమస్త వాస్తు దోషములను తొలగించి, వంశాభివృద్ధి, ఆయురారోగ్య ఐశ్వర్యములను కలుగచేయును. కుడ్య (గోడలు) వేధా దోషములను తొలగించును. వసారా దోషములు, పునాది దోషములు పారు తప్పి కట్టిన దోషములను - తూర్పు సిం హ ద్వార గృహముల యందుగల సమస్త దోష నివృత్తి కల్గును. ఈశాన్యము తగ్గి, ఉత్తర భాగము మెరకగా ఉన్న దోషములను, ఉపగ్రహముల వలన సంభవించు దోషములను పోగొట్టును. గృహము నందు సర్వసంపదలు కలిగి కార్యసిద్ధిని పొందుదురు.

**సూచన :-** పూజా విధిని ఆదివారమునాడు మాత్రమే ప్రారంభించాలి.

శుభమస్తు

★★★★★

# 17. ఈశాన్య దిశా యంత్రము




**మూల మంత్రము :-**

(1) ఓం శం శాం శీం శూం శైం హే శంభో ! మమ గృహే రాక్షస స్వరూపాన్ నాశయ నాశయ, దైవ శక్తిం దేహి దేహి కైవర్యాదీన్ రక్షయ రక్షయ హలాం ఫట్ స్వాహా !

**మహేశ్వర గాయత్రి :-** ఓం తత్పురుషాయ విద్మ హే మహా దేవాయ ధీమహి ! తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥

**ఈశాన గాయత్రి :-** ఓం మహాదేవాయ విద్మహే శూల హస్తాయ ధీమహి తన్నో ఈశానః ప్రచోదయాత్

(పూజ, జపానంతరము చివరలో 108 సార్లు ఫలించాలి)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి రేకు మీద యథా తథముగా బ్రహ్మజ్ఞులచే తయారు చేయించుకోవలయును. పిదప యంత్రమునకు సమస్త సంస్కారములు జరిపించి, శుభముహూర్తమున పూజాదికములు ప్రారంభించవలయును.

**లఘు పూజావిధి :-** యంత్రమును 40 రోజులు పూజించవలెను. ప్రతి దినము పంచామృతాభిషేకము జరిపి, నిత్యము మూల మంత్రమును 108 సార్లు జపించుచు యంత్రముపై, కుంకుమాక్షతలు, పుష్పములు ఉంచవలయును. యధాశక్తి నిత్యము ధూప దీపనైవేద్యములను సమర్పించవలయును.

చివరి రోజున - మూల మంత్రమును 216 సార్లు జపించుచు, ఆవునేయి, రావి పుల్లలతో హోమము చేయవలయును. 40 రోజులు ముగిసిన పిదప యంత్రమును, ఈశాన్య ద్వారము గల, ఈశాన్య నడక గల ఇంటికి, ఈశాన్య భాగ గోడ యందు నవరత్న లోహాదుల నుంచి యంత్రముల బిగించవలయును.

**ఫలము :-** కుటుంబవృద్ధి, ఉన్నత పదవీ యోగ్యత, విద్యాభివృద్ధి, ధనవృద్ధి కలుగును. సమాజమున గౌరవాదులు పెంపొందును. ఈశాన్య భాగ దోషములకు పరిహారమగును. నరఘోష నివారణ యగును. ఆరోగ్యము కుదుటపడును. సర్వకాలముల యందు పరమేశ్వరాను గ్రహముచే ఆనందోత్సాహములు కల్గి యుందురు.

**సూచన :-** మంత్రోచ్చారణ 'సస్వరముగా' ఉండవలెను. పూజా నిర్మాల్యమును నది యందు కలుపవలెను. యధాశక్తి బ్రాహ్మణులకు సంతర్పణ చేయవలెను.

ఓం శాంతిః

★★★★★

# 18. ఇంద్ర దిశా యంత్రము



**మూల మంత్రము :-**

ఓం నమో మహేంద్రాయ ! మమ గృహే భోగభాగ్యాధీన్ అభివృద్ధిం కురు కురు ఓం లాం లీం లూం లైం స్వాహా !

## ఇంద్ర గాయత్రి

ఓం లోక రక్షాయ విద్మహే మహా శ్రేష్టాయ ధీమహి ।
తన్నో ఇంద్ర ప్రచోదయాత్ ॥

(పూజ, జపానంతరము 108 సార్లు జపించాలి)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5")ప్రమాణము గల రాగి రేకుపై బ్రహ్మజ్ఞులచే తయారు చేయించుకొని, యంత్ర సంస్కార, ప్రాణ ప్రతిష్ట జీవ కళాన్యాసములను జరిపించి - తారాబల, చంద్రబల యుక్తమైన శుభ దినమున పూజను ప్రారంభించవలెను.

**లఘు పూజావిధి :-** ఈ యంత్రమును 40 రోజులు యధాశక్తి పూజించి, ప్రతిదినము మూల మంత్రమును 216 సార్లు జపించుచు యంత్రమునకు ధారపోయవలెను. నిత్యము యధాశక్తి ధూప, దీప, నైవేద్యాదులను అర్పించవలెను. నియమము, దీక్షతో ఈ పూజాదికములు నిర్వహించవలెను. పుష్పాక్షతలతో నిత్య పూజ జరుపవలెను.

చివరి రోజున - మూల మంత్ర సహితముగా - రావి పుల్లలు, ఆవు నేతితో మిశ్రము చేసిన నవ ధాన్యములతో హోమము నిర్వహించవలెను.

**సూచన :-** మూలమంత్రమును 'సస్వరముగా' చదువవలెను సందేహములున్న దైవజ్ఞుల ద్వారా నివృత్తి చేసుకొని పూజాదులు నిర్వహించుట మంచిది.

**ఫలము :-** ఈ యంత్ర పూజ - ప్రతిష్ఠాపనచే - ధనవృద్ధి, కుటుంబ, వృత్తి వ్యాపారములందు అభివృద్ధి చేకూరును. గౌరవ, మర్యాదులు పెంపొందును. శత్రునాశనము, ఆయురారోగ్యములు కల్గి సర్వత్రా విజయము చేకూరి, సత్సంతానము కల్గును. తూర్పు ద్వారము గల ఇంటికి, తూర్పు గోడలో - బంగారు, వెండి, రాగి సహితముగా నవరత్నముల నుంచి గోడలో బిగించవలెను. అందువల్ల - స్థలము లందున్న ఎత్తు పల్లముల దోషము, ఈశాన్య శల్య వలన దోషము, అనుచితముగా నిర్మించిన గృహ దోశములు, వృక్షాచ్ఛాదన దోషము, విష బాహు స్థల దోషము మొదలుగా గల అనేక విధములైన వాస్తు దోషములను పరిహరించి గృహ యజమానికి పరిపూర్ణ సుఖము ఆనందము చేకూర్చును.

ఓం శాంతిః



# 19. వరుణ దిశా యంత్రము



**మూల మంత్రము :-** ఓం వం వాం వీం వైం వరుణ దేవాయ మమ గృహే స్త్రీ పురుష బాలాదీన్ అన్యోన్యం కురు కురు భోగ భాగ్యాదికంచ అభివృద్ధిం దేహి దేహి, ఋణాదీన్ విమోచయ విమోచయ ఫట్ స్వాహా !

## వరుణ గాయత్రి

ఓం సుధీశ్వరాయ విద్మహే పాశహస్తాయ ధీమహి
తన్నో వరుణః ప్రచోదయాత్ ॥

(రోజు పూజానంతరము 108 సార్లు పఠించాలి)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - ($5'' \times 5''$) సైజు గల రాగి రేకు పై దైవజ్ఞులచే తయారు చేయించుకొని, యంత్ర సంస్కారములన్నియు జరిపించి, ప్రాణ ప్రతిష్ట గావించి పూజాదికములు నిర్వహించవలెను.

**లఘు పూజావిధి :-** ఈ యంత్రమును 40 రోజులు నియమ, నిష్టలతో, దీక్షతో పంచామృత అభిషేక సహితముగా జరుపవలెను. నిత్యము మూల మంత్రమును 216 సార్లు జపించుచు యంత్రమునకు ధారబోయ వలెను. పుష్పాక్షతలు, కుంకుమాదులతో యంత్రమును నిత్యము పూజించవలెను. ప్రతి దినము యధాశక్తి ధూప, దీప, నై వేద్యాదులను సమర్పించవలెను.

చివరి రోజున - ఉత్తరేణు పుల్లలు, ఆవునేతిలో - మూలమంత్రము జపించుచు 216 హోమము చేయవలెను. పిదప పూజా నిర్మాల్యమును నదిలో కలుపవలెను. ఆ తదుపరి యంత్రమును పశ్చిమ దిశ గోడలో - బంగారు, వెండి, రాగి లోహ సహితముగా నవరత్నముల నుంచి - గోడయందు బిగించవలెను.

**ఫలము :-** పశ్చిమ దిశ నడకగల ఇంటికి గల దోషములను నివారించును. గృహమధ్య భాగమున గల దిగుడు బావుల వలన కలుగు దోషములు, పశ్చిమ దిశకు నీటి వాటము గల స్థల, గృహ దోషములు, నైబుతి పెరిగియున్న దోషములు - పరిహరించి - గృహమునందు శాంతి సౌఖ్యములు, శత్రుబాధానివారణ, స్త్రీ అధికారములను తొలగించి, సంపదవృద్ధిని చేకూర్చును. గృహ పీడా దోషములను నివృత్తి చేయును. సర్వజనులు ప్రీతి పాత్రులగుదురు సంతానము అభివృద్ధిలోనికి వచ్చి ప్రయోజకులగుదురు. ఈ యంత్రము వివిధములైన వాస్తు దోషములను తొలగించి, గృహ యజమానికి ఆయుర్వృద్ధి కలిగించును.

*ఓం శాంతిః*



# ౨౦. వాయుదిశా యంత్రము



**మూల మంత్రము :-** ఓం యం యాం యూం య్రైం యూం హే వాయు దేవా! మమగృహే సర్వ కలహాదీన్ నివారయ నివారయ, విద్యా వ్యాపారాభివృద్ధిం కురు కురు దైవశక్తీన్ ప్రాపయ ప్రాపయ స్వాహా !

## మరుత్ గాయత్రి

ఓం జగత్రాణాయ విద్మహే యష్టి హస్తాయ ధీమహి
తన్నో వాయుః ప్రచోదయాత్ ॥

(నిత్యము పూజాదికములనంతరము 108 సార్లు చదువవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి రేకు మీద దైవజ్ఞులచే తయారు చేయించుకొని, యంత్ర సంస్కార, జీవకళాన్యాస, ప్రాణ ప్రతిష్ఠాది క్రియలను పూర్తి చేసి, శుభముహూర్తమునందు పూజాదికములను ప్రారంభించవలెను.

**లఘు పూజావిధి :-** ఈ యంత్రమును 40 రోజులు పూజించవలెను. నిత్యము పంచామృత అభిషేకము చేయవలెను. పుష్పాక్షతలతో పూజించవలయును. దీక్ష, నియమములు అత్యంత అవసరము. నిత్యము పూజానంతరము, మూలమంత్రమును 216 సార్లు జపించి యంత్రమునకు ధారబోయవలెను. యధాశక్తి, నిత్యము ధూప, దీప, నైవేద్యాదులను సమర్పించవలెను.

చివరి రోజున, రాలిపుల్లలు, ఆవునేతితో మూలమంత్రము జపించుచు 216 సార్లు హోమము చేయాలి. బంధు, మిత్రాదులతో చివరన బ్రాహ్మణ సంతర్పణ చేసినచో చాలా మంచిది. పిదప యంత్రమును వాయువ్య మూలగల గోడలో - నవరత్న, బంగారు, వెండి, రాగి లోహ సహితముగా బిగించవలెను.

**ఫలము :-** వాయువ్య కోణ ద్వారము గల ఇంటికి గల సమస్త వాస్తు దోషములను పరిహరించును. సమస్యలు, వైరములు తొలగును. తరచుగావచ్చు రోగాది పీడలు నశించును. వృక్ష వేధలు, క్షీణించిన గృహ దోషములు, తొలగించి నూతనోత్సాహము, ధైర్య పరాక్రమములు, ఆరోగ్య, భాగ్యములు చేకూర్చును. కార్యసాధన, సర్వత్ర విజయము కల్గును. గృహ యజమాని క్షేమముగా ఉండును. మానసిక ప్రశాంతత చేకూరును. గృహమునకు గల సమస్త శుభములు చైతన్య వంతములై, స్వభావ సిద్ధమైన ఫలములు శీఘ్ర గతిని చేకూరగలవు.

ఓం తత్సత్

★★★★★

# 21. కుబేరదిశా యంత్రము



**మూల మంత్రము :-** ఓం సం సాం సీం సూం సైం సః కుబేరాయ! మమ గృహే దారిద్ర్యం నివారయ నివారయ , ధనవృద్ధిం దేహి దేహి, భూగృహ వస్తు వాహనాదీన్ ప్రాపయ ప్రాపయ ఫట్ స్వాహా !

## కుబేర గాయత్రి

ఓం మహారాజాయ విద్మహే ధనాధ్యక్షాయ ధీమహి
తన్నో కుబేరః ప్రచోదయాత్ ॥

(నిత్యము పూజ, జపాదులనంతరము 108 సార్లు పఠించాలి)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేక వెండి రేకు మీద యధాతథముగా దైవజ్ఞులచే తయారు చేయించుకొని - యంత్ర సంస్కార, జీవ కళాన్యాస, ప్రాణ ప్రతిష్ఠాదులను గావించుకుని - శుభఘడియలలో పూజ, జపముళను ప్రారంభించవలెను.

**లఘు పూజావిధి :-** ఈ యంత్రమును యధాశక్తి, దీక్షతో 40 రోజులు పూజించి అర్చించవలెను. నిత్యము పంచామృతాభిషేకము చేయవలెను. పిదప పుష్పాక్షతలు కుంకుమలతో పూజించి, పిమ్మట, మూలమంత్రమును నిత్యము 216 సార్లు జపించుచు యంత్రమునకు ధారబోయవలెను. నిత్య ధూప, దీప, నైవేద్యములను సమర్పించవలెను.

చివరిరోజన - మూలమంత్ర సహితముగా 216 సార్లు ఆవునేయి, రావి పుల్లలతో హోమము చేయవలెను. పిదప యంత్రమును ఉత్తరపు గోడలో నవరత్నాది, లోహ సహితముగా బిగించవలెను.

**ఫలము :-** ఉత్తర ద్వారము గల ఇంటికి, ఉత్తర వీధి పోటు ఉన్న ఇంటికి గల సమస్త వాస్తు దోషములను పరిహరించును. దక్షిణ, పశ్చిమ దిశలలో గల దోషములను, ఉత్తర సరిహద్దు నుండి ప్రాప్తించు సకల దోషములను పరిహరించి సుఖశాంతులు ధనధాన్యాభివృద్ధి, సర్వ సమస్యల పరిష్కారము, ఋణ, రోగ , దుఃఖముల నుండి విముక్తి చేకూర్చును. ఇష్ట సిద్ధిని కలిగించును. శత్రు పీడ నివారణ యగును. దారిద్ర బాధల నుండి విముక్తి కల్గించి విశేష ద్రవ్య ప్రాప్తిని, ఐశ్వర్య అభివృద్ధిని కలుగ చేయును.

## ధాన్యము

ఓం యక్షాయ కుబేరాయ వైశ్రవణాయ ధన ధాన్యాది పతయే
ధన ధాన్య సమృద్ధి మే దేహి దాపయ స్వాహా ॥

*ఓం శాంతిః*



# ౨౨. అగ్నిదిశా యంత్రము



**మూల మంత్రము :-** ఓం రం రాం రీం రూం రైం రః అగ్ని దేవాయ మమగృహే, చోరాగ్ని బాధాన్ నివారయ, ధనవృద్ధిం కురు కురు స్వాహా !

## అగ్ని గాయత్రి

ఓం రుద్ర నేత్రాయ విద్మహే శక్తి హస్తాయ ధీమహి
తన్నో అగ్నిః ప్రచోదయాత్ ॥

(ఈ గాయత్రిని - నిత్యము పూజానంతరము 108 సార్లు జపించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి లేక వెండి రేకు మీద దైవజ్ఞులచే చేయించుకొని, యంత్ర సంస్కార, ప్రాణ ప్రతిష్ఠ, జీవకళాన్యాసములను జరిపిన పిమ్మట - శుభ ముహూర్తమున పూజాదులను ప్రారంభించవలయును. దీక్ష, నియమములు అత్యంత ఆవశ్యకము.

**లఘు పూజావిధి :-** ఈ యంత్రమును 40 రోజులు పూజించవలెను నిత్యము పంచామృత అభిషేకము జరుపవలెను. నిత్యము పుష్పాక్షతలు, కుంకుమాదులతో యంత్రమును అర్చించవలెను. ప్రతి దినము మూల మంత్రమును స్వచ్ఛమైన ఉచ్ఛారణతో 216 సార్లు జపించి యంత్రమునకు ధారపోయవలెను. యధాశక్తి నిత్యము ధూప, దీప, నైవేద్యాదులను సమర్పించవలెను.

చివరిరోజున - నవధాన్యములను ఆవునేతితో మిళతిము చేసి, జమ్మిపుల్లలతో - మూల మంత్ర సహితముగా 216 సార్లు హోమము చేయవలెను. పిదప యంత్రమును దక్షిణ గోడ యందుగాని, ఆగ్నేయ మూల గోడ యందు గాని నవరత్న సహిత లోహములతో బిగించవలయును.

**ఫలము :-** దక్షిణ సింహద్వారము గల ఇంటికి, దక్షిణ, ఆగ్నేయం నడక గల ఇంటికి గల సమస్త వాస్తు దోషములను పరిహారము చేయును. దక్షిణ దిశా శల్యయములచే కలుగు దోషములను పరిహరించి రోగములు, ఈతి బాధలు దురాచార మూలక ధనవ్యయము తగ్గును. ఆత్మజ్ఞానాభివృద్ధి, అఖిలైశ్వర్య సమృద్ధి కలుగును. చోరాగ్ని బాధలు తొలగును. సర్వతో ముఖాభివృద్ధి చేకూరును.

*ఓం శాంతిః*



# 23. యమదిశా యంత్రము



**మూల మంత్రము :-** ఓం హం హ్రాం హ్రీం హ్రౌం యమ దేవాయ మమగృహే సర్వకష్ట నష్టాదీన్ నివారయ నివారయ, ధనవృద్ధిం దేహి దేహి సర్వకామ్యాదీన్ అభివృద్ధిం దేహి దేహి !

## గాయత్రి

ఓం వైవస్వతాయ విద్మహే దండ హస్తాయ ధీమహి
తన్నో యమః ప్రచోదయాత్ ॥

(ఈ గాయత్రీ మంత్రమును నిత్యపూజానంతరం 108 మార్లు పఠించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - ($5'' \times 5''$) సైజు గల రాగి లేక వెండి రేకు మీద దైవజ్ఞులచే తయారు చేయించుకోవలెను. యంత్ర సంస్కార, ప్రాణప్రతిష్ఠ, జీవ కళాన్యాసములు జరిపిన పిమ్మట, శుభలగ్నమునందు పూజాదికములు ప్రారంభించవలెను. దీక్షగా నుండవలెను.

**లఘు పూజావిధి :-** యంత్రమును నిత్యము పంచామృతములతో అభిషేకించి, పుష్పాక్షతలు, కుంకుమాదులతో అర్చించవలెను. పిదప మూలమంత్రమును **216** సార్లు జపించి యంత్రమునకు ధార బోయవలెను. యధాశక్తి నిత్యము ధూప, దీప, నైవేద్యాదులర్పించవలెను. ఈ విధముగా **40** దినములు పూజించవలెను.

చివరిరోజున - జమ్మి, మామిడి పుల్లలతో, ఆవునేతితో మూలమంత్రమును జపించుచూ **216** సార్లు హోమము చేయవలెను. పిదప యంత్రమును - నవరత్న - లోహ సహితముగా దక్షిణ గోడ యందు బిగించవలెను. యంత్రము బయటకు కనబడరాదు.

**ఫలము :-** ఈ యంత్రస్థాపన వల్ల - దక్షిణ సింహ ద్వారము గల గృహమునకు సంబంధించిన సమస్త వాస్తు దోషములు పరిహారమగును. వృత్తి వ్యాపారాదులందు ధనవృద్ధి కల్గును. సంతానాభివృద్ధి కల్గును. యమబాధలు, మానసిక బాధలు నివృత్తి యగును. ఆరోగ్యముచేకూరును. సర్వకార్యానుకూలత, శత్రు నాశనము అగును. అకాల మృత్యుదోష నివారణ యగును. గృహ యజమాని సుఖ సంతోషాదులతో మనుగడ సాగించెదరు.

ఓం శాంతిః



# 24. నైరుతి దిశా యంత్రము



**మూల మంత్రము :-** ఓం షం షాం షీం సైం, హే నిరుతి దేవా । మమగృహే సంక్షోభం నివారయ నివారయ శత్రూన్ మారయ మారయ వాస్తు దోషం నివారయ నివారయ, కుటుంబ అభివృద్ధిం కురు కురు స్వాహా !

## గాయత్రి

ఓం నిశాచరాయ విద్మహే ఖడ్గ హస్తాయ ధీమహి ।
తన్నో నిరురుతిః ప్రచోదయాత్ ॥

(ఈ గాయత్రిని నిత్యము పూజానంతరము 108 మార్లు పఠించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి లేక వెండి రేకు మీద గాని దైవజ్ఞులచే తయారు చేయించుకొని యంత్ర సంస్కార, ప్రాణప్రతిష్ఠ, జీవకళాన్యాసములను జరిపిన పిమ్మట శుభముహుర్తమునందు పూజాదికములను ప్రారంభించవలెను. దీక్ష నియమములు చాలా`ముఖ్యము.

**లఘు పూజా విధి :-** ఈ యంత్రమును 40 రోజులు - నిత్య పంచామృతాభిషేకముతో, పుష్పాక్షతలతో కుంకుమతో పూజించవలయును. ప్రతి దినము మూలమంత్రమును శ్రద్ధగా, స్వచ్ఛముగా 216 సార్లు జపించి యంత్రమునకు ధార బోయువలెను. ప్రతి రోజు యధాశక్తి ధూప దీప నైవేద్యములను సమర్పించవలెను.

చివరిరోజున - రావి పుల్లలు, ఆవునేతితో మూల మంత్రముతో 216 సార్లు హోమము చేయవలెను. పిమ్మట యంత్రమును నైరుతి ద్వారమున్న గోడలోపల - నవరత్న, లోహది సహితముగా బిగించవలెను.

**ఫలము :-** నైఋతి మూల రాక్షస స్థానమని శాస్త్ర వచనము. అట్టి నైరుతి మూల సింహద్వారము గల గృహములందు ఈ యంత్రముంచిన తత్ స్థాన వాస్తు దోషములన్నియు పరిహరింపబడును. కోర్టు వ్యవహారములందు అనుకూలత కల్గును. కుటుంబ కలహములు నశించును. భార్యాబిడ్డల వ్యవహారములందు సానుకూల త చేకూరును. గృహ యజమానికి మానసిక శాంతి కల్గి, మంచి ఆలోచనలతో సర్వ కార్యములు విజయవంతముగా పూర్తి చేసుకొనగలరు. పదవీచ్యుతి కల్గిన వారికి తిరిగి యధాస్థానమును పొందగలరు. ధనాభివృద్ధి కలుగును. సర్వ శుభములు చేకూరును.

ఓం శాంతిః



# 25. గణపతి యంత్రము




గణపతి యంతము

### మూల మంత్రము

(1) ఓం నమో భగవతే ! వక్రతుండాయ ! మహాగణపతయే ! ఆం హ్రీం క్రోం హ్రీం గం శ్రీం సర్వజన ముఖ హృదయ రంజనమ్ కురుకురు స్వాహా !

(2) ఓం హ్రీం శ్రీం గం గణపతయే స్వాహా

## గణపతి గాయత్రి

ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి
తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

(ఈ గాయత్రిని - జపాదులనంతరము 108 సార్లు పఠించవలెను)

**గణపతి మంత్రమ్ :-** అస్య శ్రీ గణపతి మహా మంత్రస్య। దూర్వాస ఋషిః । అనుష్టుప్ ఛందః । గణపతిర్దేవతా । గం బీజమ్ । హ్రీం శక్తిః । స్వాహా కీలకమ్ । అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ॥ గామితి అంగాన్యాస కరన్యాసమ్ కుర్యాత్ ॥

(అని చెప్పుకొనిన పిదప జప మాచరించవలయును)

సర్వ విఘ్న నాయకుడు గణేశుడు. అట్టి విఘ్నములను పారద్రోలి సర్వకార్యానుకూలత కల్గించునట్టి యంత్రరాజమిది. ఈ యంత్రము నిత్య జీవితము నందలి కార్యానుకూలతకే గాక, విశేషించికొన్ని వాస్తు దోషములను కూడా పరిహారము గావించును.

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేక వెండి రేకుపై దైవజ్ఞులచే నిర్మింపజేసి, యంత్ర సంస్కారములు, ప్రాణప్రతిష్ఠ, జీవ కళాన్యాసములు జరిపిన పిమ్మట పూజాదికములను నిర్వహించవలెను.

**పూజా విధి :-** ఈ యంత్రమును 40 రోజులు పూజించవలెను. నిత్యము షోడశోపచారపూజలు నిర్విహించి, మూల మంత్రమును మొత్తము 40 దినములలో ఒక లక్ష 20 వేల పర్యాయములు జపించి, యంత్రమునకు ధారబోయవలెను. ఇందుచే యంత్రమునకు విశేష శక్తి చేకూరును.

చివరిరోజున - అష్ట ద్రవ్యములతో అనగా (కుడుములు, అటుకులు, చెఱుకు ముక్కలు, కొబ్బరి ముక్కలు, పేలాలు, శ్రీగంధ సమిధలు, తెల్లగరిక ఆవు నెయ్యి) తో మూలమంత్ర సహితముగా హోమము చేయవలెను. పిదప యంత్రమును గృహమునందలి విశేష ప్రదేశమున స్థాపించవలెను.

**ఫలము :-** దీక్ష, నియమములలో చేసిన పూజాదికములకు నిర్దేశిత ఫలములు సత్వరము లభింపగలవు. ఈ యంత్రము వలన గౌరవ మర్యాదులు, సంఘమున పలుకుబడి, సత్కీర్తి, ఉన్నత పదవి లాభము, కుటుంబ సౌఖ్యము, కార్యాను కూలతలను చేకూర్చును. గృహమునందలి పశ్చిమ, నైఋతి దిశల దోష పరిహారమగును. గృహ యజమాని సుఖము, ఆనందము, ఐశ్వర్యాభివృద్ధితో వర్ధిల్లును.

ఓం శాంతిః



# 26. శ్రీమహాలక్ష్మీ యంత్రము



శ్రీ మహా లక్ష్మీ యంత్రము

## మూల మంత్రము

అస్యశ్రీ మహాలక్ష్మీ మహామంత్రస్య । దక్ష ప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః । మహాలక్ష్మీ ర్దేవతా । శ్రీం బీజమ్ । హ్రీం శక్తిః । క్లీం కీలకమ్ । అఖండైశ్వర్య సిద్ధ్యర్థే జపే వినియోగః । శ్రామితి షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥

(అని చెప్పుకొనిన పిదప క్రింది మంత్రమును జపించాలి)

"ఓం శ్రీం హ్రీం క్లీం శ్రీం ఐం సౌః కమలే కమలాలయే
ప్రసీద ప్రసీద సౌః క్లీం ఐం శ్రీం హ్రీం క్లీం త్రుసూత్యైస్వాహా ॥"

# మహాలక్ష్మీ గాయత్రి

ఓమ్ మహా దైవ్యైచ విద్మహే విష్ణు పత్నీ చ ధీమహి
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేదా వెండి రేకు మీద బ్రహ్మజ్ఞులచే నిర్మాణము గావించుకొని, యంత్ర సంస్కార, ప్రాణ ప్రతిష్ఠ జీవ కళాన్యాసములను గావించిన పిదప శుభ ముహూర్తమున పూజ, జపాదులను నిర్వహించవలయును.

**పూజా విధి :-** ఈ యంత్రమును మండలము (40) రోజులు యధావిధిగా దీక్షతో పూజించవలయును. ప్రతి దినము షోడశోపచార పూజలను నిర్వహించవలెను. మూల మంత్రమును మొత్తము 40 రోజులలో ఒక లక్ష పర్యాయములు జపించి యంత్రమునకు ధారబోయవలెను. రోజుకు 25000 సార్లు జపము ఆచరించవలయును. సంఖ్య తగ్గకూడదు. సస్వరముగా మంత్రమును జపించ వలయును.

పిదప, చివరిరోజున శుభముహూర్తము నందు యంత్రమును గృహము నందుగాని వ్యాపారస్థలముల యందుగాని, కర్మాగారము[illegible] [illegible]ందు గాని స్థాపించవలెను.

**ఫలము :-** దీక్ష, నియమ నిష్టలతో పూజించి యంత్ర ప్రభావమును స్వానుభవముతో తెలుసుకోవలయునే గాని వర్ణింప అశక్యము. ఈ యంత్రము వలన సామాన్య ఫలితములే గాక గృహ, స్థల వాస్తు దోషములను కూడా పరిహారమగును. ఉత్తర సింహద్వార గృహ దోషములు, తూర్పు - ఉత్తర దిశల యందలి మెరక దోషములు, గృహోపకరణముల ద్వారా కలుగు దోషములు, కర్మాగారములందలి దోషములు, యంత్ర ప్రాధాన్యత గల ప్రదేశము లందలి దోషములు పరిహారమగును. యజమానులకు సుఖ సౌఖ్యములు, ధనధాన్యాభివృద్ధి, కుటుంబవృద్ధి, వ్యాపార వృద్ధి, కీర్తి ప్రతిష్ఠలు కల్గును. అత్యున్నత పదవీ యోగము కల్గును.

అఖండ భోగ భాగ్యములను చేకూర్చును. ఏలనన - శ్రీ మహాలక్ష్మీ దేవి - సౌభాగ్య దాయిని. ఈమె అనుగ్రహము కల్గిననూ, కృపాకటాక్షములు పొందినను సర్వత్ర విజయమే కదా। సదా ఆనందమే ఆరోగ్యమే.

ఓం శాంతిః



# ౨౮. శ్రీ సుబ్రహ్మణ్య యంత్రము




## సుబ్రహ్మణ్య మూల మంత్రము

అస్యశ్రీ సుబ్రహ్మణ్య మహా మంత్రస్య । అగస్త్య భగవాన్ ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీ సుబ్రహ్మణ్యో దేవతా । సాం బీజమ్ । ఓమ్ శక్తిః । శరవణ భవాయేతి కీలకమ్ । శత్రు నిషూదన ద్వారా సకల శ్రేయోభి వృద్ధర్థ్యే జపే విని యోగః ॥

ప్రాం స్రాం ఇతి షడంగన్యాసం కుర్యాత్ ॥

(పై విధముగా చెప్పుకొనిన పిదప క్రింది నిచ్చిన మంత్రములలో నొక దానిని జపించవలెను)

**మూల మంత్రము :-**

(1) ఓం సౌం శరవణభవ !!

(2) ఓం శ్రీం హ్రీం క్లీం సౌం శరవణ భవాయ స్వాహా !!

( ఈ మంత్ర పునశ్చరణ యందు అనగా జపము నందు కఠిన నియమ, నిష్ఠలను తప్పక పాటించవలయును. లేనిచో ఫలము శూన్యమని గ్రహింపనగును)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేదా వెండి రేకు మీద దైవజ్ఞులతో యంత్రమును తయారు చేయించుకొని, దానికి సంస్కారమలన్నియు జరిపి, ప్రాణ ప్రతిష్ఠ, జీవకళాన్యాసములను జరిపించి శుభ ముహూర్తమున పూజాదికములు ప్రారంభించవలయును.

**పూజా విధి :-** యంత్రమును 40 రోజులు దీక్షతో షోడశోపచార పూజలు జరుపుచు, నిత్యము మూల మంత్రమును జపించవలెను. మొత్తము 40 రోజులలో మూలమంత్రమును ఒక లక్షా పదివేల పర్యాయములు జపించవలెను. తదనుగుణముగా దినమున కేన్ని మార్లు జపించవలెనో చూసుకొని జపవిధి సాగించవలెను. జపసంఖ్య తగ్గ కూడదు. పిదప యంత్రమునకు జప ఫలమును ధారబోయ వలెను. అప్పుడే యంత్రము శక్తి వంతమగును.

**సూచన :-** ఈ నలుబది రోజులు దీక్షా వస్త్రధారణ తోనే పూజాదికములు నిర్వహించాలి. బ్రహ్మచర్యము, భూశయమనము చాలా ముఖ్యము.

**ఫలము :-** 40 రోజులు పూజాదులు ముగిసిన పిమ్మట యంత్రమును గృహము నందుంచి పూజించుచుండవలయును. తత్ఫలితముగా పుత్ర-పౌత్రాది వంశాభివృద్ధి, శత్రునాశనము, ఇష్ట సిద్ధి, గృహ-సంసార బాధా నివృత్తి, లక్ష్మీ కటాక్షము, దైవానుగ్రహము, సర్వాటంక నివారణ, ఐశ్వర్యప్రాప్తి కల్గును.

వాస్తురీత్యా - సర్వాకారస్థల దోషములు, మృత సంతాన దోషములు, దక్షిణ దివంగత నిర్మాణ దోషములు, దశ విధ వంధ్యా దోషములను పరిహరించి, గృహ యజమానికి రోగ రాహిత్యము, సర్వబాధా నివృత్తి కలుగజేయుటలో - ఈ యంత్రము ఎంతయో మహిమాన్వితమైనవి.

**గాయత్రి :-** ఓం తత్పురుషాయ విద్మహే మహా సేనాయ ధీమహి
తన్నో: షణ్ముఖః ప్రచోదయాతు ।

ఓం శాంతిః



# ౨౮. కుబేర యంత్రము




కుబేర యంతము

## కుబేర మహా మంత్రము

అస్యశ్రీ కుబేర మహా మంత్రస్య । విశ్రవసు ఋషిః । బృహతీ ఛందః । ధనేశ్వరః కుబేరో దేవతా । శ్రీం బీజమ్ । స్వాహా శక్తిః । హ్రీం కీలకమ్ । ధన-కనక వస్తు వాహన సమృద్ధ్యర్థే జపే వినియోగః । శ్రామితి షడంగన్యాసమ్ కుర్యాత్ ॥

**మూల మంత్రము :-** ఓం హ్రీం సం శ్రీం క్లీం యక్షాది పతయే కుబేరాయ । ఘోర దారిద్ర్య ధ్వంసనాయ । ద్రీం ప్రేం క్లీం క్లీం బ్లూం బ్లూం ధనధాన్యాధిపతయే। ధన ధాన్య సమృద్ధి మేం దేహి దేహి దాపయ దాపయ స్వాహా ॥

**కుబేర గాయత్రీ :-** ఓం ధన ప్రదాయ విద్మహే
వైశ్రవణాయ ధీమహి । తన్నో యక్షః ప్రచోదయాత్ ॥

( ఈ గాయత్రిని - జపాద్యంతములందు నిత్యము 108 సార్లు జపించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి రేకు మీద దైవజ్ఞులచే తయారు చేయించుకొనవలయును. పిదప యంత్ర సంస్కారములు, జీవకళాన్యాస, ప్రాణ ప్రతిష్ఠ గావించిన పిమ్మట శుభ ముహూర్తమున పూజ, జపాదులను ప్రారంభించ వలయును.

**పూజావిధి :-** యంత్రమునకు 40 రోజులు పూజలు జరుపవలెను. నిత్యషోడశోపచార పూజలతో యంత్రమును పూజించుచు, పైన తెల్పిన మూలమంత్రామును మొత్తము 40 రోజులలో ఒక లక్ష పర్యాయములు జపించి యంత్రమునకు ధార బోయవలెను. రోజునకు ఎంత జపమో నిర్ణయించుకొని నిత్యము అంతనే జపము చేయాలి. తగ్గకూడదు. దీక్ష, నియమములు అత్యంత ముఖ్యము . 40 రోజుల పిదప శుభఘడియ లందు యంత్రమును ఉత్తర దిక్కు గోడలో నవరత్న సహితముగా స్థాపించవలెను.

**ఫలము :-** నిరంతర విష్ణుసేవా తత్పరుడు, రుద్రుని భక్తుడు అయిన ఈకుబేర యంత్రము వలన సర్వ దోషములు పరిహరించి, గృహయజమానికి - రోగ, ఋణ, శత్రు పీడలను నశింప జేయును. దారిద్ర్య నివృత్తి యగును. ధనధాన్యవృద్ధి కల్గును. ఇష్ట సిద్ధిని చేకూర్చును. విశేష ధన, ధాన్య, వస్తు లాభములను కల్గించును.

అంతేగాక, ఈ యంత్రము వాస్తురీత్యా ఉత్తర సింహద్వార గృహములకు కలుగు అన్ని విధములైన వాస్తు, దోషములను,ఉత్తర సరిహద్దు దోషములను, ద్రవ్య స్థానమున అస్తవ్యస్త నిర్మాణ దోషములను పరిహరించి యజమానికి అఖిల ఐశ్వర యోగమును కలిగించును.

ఇది విశేష యంత్ర రాజము. మన దీక్ష, నియమ, నిష్ఠల లోపమే కాని, యంత్రము మాత్రము సకల ఫలదాయిని.

ఓం శాంతిః



# ౭౮. శ్రీగాయత్రీ యంత్రము



గాయత్రీ యంత్రము

## గాయత్రీ మహా మంత్రము

అస్యశ్రీ గాయత్రీ మహా మంత్రస్య । విశ్వామిత్ర ఋషిః । గాయత్రీ ఛందః సవితా దేవతా । యం బీజమ్ ।ఈం శక్తిః । ణం కీలకమ్ । సర మనో భీష్ట సిద్ధర్థే జపే వినియోగః ॥

మూలమంత్రేణ షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥

(అని చెప్పిన పిదప మూల మంత్రమును జపించాలి)

## మూల మంత్రము

ఓం భూర్భు వస్సువః తత్సవితుర్వ రేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ ॥

(ఈ మూలమంత్రమును 40 రోజులలో యంత్ర పూజ జరుపుచు ఒక లక్ష పర్యాయములు వ్యాహృతీ యుతముగా, దీక్ష, నియమావళితో జపించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి రేకు లేదా వెండి రేకు మీద దైవజ్ఞులతో తయారు చేయించుకొనవలయును. పిదప యంత్ర సంస్కార ప్రాణ ప్రతిష్ఠాదులు నిర్వహించి పూజాదికములు ప్రారంభించవలెను.

**పూజా విధి :-** యంత్రమును 40 రోజులో అత్యంత దీక్షతో షోడశోపచార పూజలతో సేవించ వలయును. నిత్యము ముందు తెల్పిన మూల మంత్రమును సస్వరముతో ఒక లక్ష పర్యాయములు జపించిన పిమ్మట, యంత్రమునకు ధారబోయవలెను. పిదప యంత్రమును గృహమునందు పూజా మందిరము నందుంచి నిత్యము గాయత్రీ మాత సేవార్చనలు జరుపుకొనవలెను.

**ఫలము :-** వేదమాత గాయత్రీ దేవి ప్రణవ స్వరూపిణి । దివ్యశక్తియగు గాయత్రీ యంత్రము ప్రతి ఇంటిలోను ఉండవలసినది. తల్లి కృపచే సర్వ పాపహరణము జరిగి, విద్యా, వివేకములు అభివృద్ధి చెందును. ఆయురారోగ్య భాగ్యాదులను కల్గించును. సకలారిష్ట నివారణ యగును. వాక్శుద్ధి, పాండిత్య ప్రాభవములు సమకూరును. ధర్మ చింతన అలవడును. సౌశీల్యత ఏర్పడును. అది ఇది అననేమి మనసా, వాచా, కర్మణా ఆ తల్లిని సర్వస్య శరణాగతి వేడిన వారికి ఏమి కావలయునో అవి అన్నియు ఒసంగునట్టి కల్పవల్లి.

అంతేగాక - ఈ యంత్రము గృహము నందు ఉండుట వలన అనేక విధములైన వాస్తు దోషములు కూడా పరిహారమగును. గృహము నందుగాని, స్థలమునందు గాని గల అన్య సంసర్గ. గవాక్ష, బాహ్య, అంతర్గతములైన అనేక దోషములను పరిహరించును. గృహ యజమానికి సర్వ రక్షగానుండు యంత్ర రాజము ఈ గాయత్రీ యంత్రము.

సర్వం శుభం



# ౩౦. శ్రీకూర్మ యంత్రము



శ్రీ కూర్మ యంత్రము

## శ్రీ కూర్మ మహా మంత్రము

అస్యశ్రీ శ్రీ కూర్మ మహా మంత్రస్య । కశ్యప ఋషిః । ప్రకృతిచ్ఛందః । కచ్ఛప రూపీ శ్రీ మహా విష్ణుర్దేవతా । కుం బీజమ్ । ధరా ధర దురంధరా యేతి శక్తిః । నమః కీలకమ్ । సర్వాభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

కామితి షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥

(అని చెప్పిన పిదప మూలమంత్రము జపము చేయవలెను)

## మూల మంత్రము

ఓమ్ నమో భగవతే । కుం కూర్మాయ ।
ధరాధర దురంధరాయ నమః ।

## కూర్మ గాయత్రీ

ఓమ్ కూర్మ రాజాయ విద్మహే । ధరాధరాయ ధీమహి ।
తన్నో కూర్మః ప్రచోదయాత్

(నిత్యము జపాద్యంతములందు 108 సార్లు జపించాలి)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి రేకు మీద యథావిధిగా శాస్త్రజ్ఞులు, దైవజ్ఞులచే నిర్మింపజేసుకొని, యంత్ర సంస్కారములన్నియు నిర్వహించి, ప్రాణ ప్రతిష్ఠాదులు గావించి శుభ ముహూర్తము నందు యంత్ర పూజాదికములు ప్రారంభించవలెను.

**పూజా విధి :-** ఈ యంత్రమును 40 రోజులు నియమ నిష్ఠలతో, దీక్షలో నిత్యము షోడశోపచార పూజలతో సేవించి, ప్రతిరోజు మూలమంత్రమును 2500 సార్లు జపించు చుండవలెను. జపానంతరము ఫలమును యంత్రమునకు ధారబోయవలెను. అందుచే యంత్రము శక్తివంత మగును ఈ విధముగా 40 రోజులలో మంత్ర జపము ఒక లక్ష యగును. పిదప శుభ ఘడియలలో గృహమునందు యంత్రమును స్థాపించవలయును.

**ఫలము :-** ఈ కూర్మ రూపము విష్ణు దేవుని అవతారము. ఈ శ్రీకూర్మ యంత్ర స్థాపనచే గృహము నందు దైవిక శక్తిని పెపొందించును. సౌభాగ్యము, ఆరోగ్యమును అభీష్టకార్యసిద్ధిని, స్థాన శక్తిని పెంపొందించి, శుభ సంపత్తిని కలుగజేయును. వంశాభివృద్ధిని కల్గించును. కుటుంబమును రక్షించును.

అంతేగాక వాస్తు సంబంధిత దృశ్యాదృశ్య గృహ దోషములను, జలాశయాది సమస్త దోషములను, పరిహరించును. వాపి, కూప, తటాక శూలాది దోషములు, అన్యజలస్థిత దోషములు, నదీ నద ప్రవాహాది దోషములు, పరిహరించి గృహమునకు వాస్తు శుద్ధిని చేకూర్చి, యజమానికి, కుటుంబమునకు సంరక్షగా నుండును.

**ధ్యానము**

శ్లో ॥ పీతాంబరమ్ కూర్మ పృష్ఠమ్ లస ల్లాంగుల శోభితమ్ ।
దీర్ఘ గ్రీవమ్ మహా గ్రాహ మాశ్రయే రక్త లోచనమ్ ।

ఓం హరిః ఓం

# 31. శ్రీ సుదర్శన యంత్రము




సుదర్శన యంత్రము

## సుదర్శన మహా మంత్రము

అస్యశ్రీ శ్రీ సుదర్శన మహా మంత్రస్య । అహిర్బుధ్న్య భగవాన్ ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీ సుదర్శనో దేవతా । ఓం బీజమ్ । హుం శక్తిః । ఫట్ కీలకమ్ । సర్వత్ర సర్వతో రక్షణార్థే జపే వినియోగః ॥

హ్రామితి షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥

## మూల మంత్రము

**1.** ఓం ఆం హ్రీం క్రోం సహస్రార హుం ఫట్ స్వాహా ॥

(ఈ మంత్రము యంత్ర సంస్కారములకు మంచిది)

2. ఓం క్రాం్యం సహస్రార హుం ఫట్ స్వాహా ।

(ఈ మంత్రము ప్రత్యేకించి గ్రహనాశనాదుల యందు ఉపయోగము)

## సుదర్శన గాయత్రీ

ఓమ్ సుదర్శనాయ విద్మహే । మహా దీప్తాయ ధీమహి ।
తన్నో చక్రః ప్రచోదాయాత్ ॥

( ఈ గాయత్రీ మంత్రమును జపాద్యంతములదు 108 లేక 216 పర్యాయములు జపించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేక వెండి రేకు మీద దైవజ్ఞులచే తయారు చేయించుకొని, యంత్ర సంస్కార, ప్రాణప్రతిష్ఠ, జీవకళాన్యాసాదులను గావించి, శుభముహూర్తమున పూజా స్థానమందుంచి పూజాదులు ప్రారంభించవలయును.

**పూజా విధి :-** ఈ సుదర్శనము - శ్రీ మహా విష్ణువు యొక్క ప్రధాన ఆయుధము - ఈ స్వరూపము. సర్వులకు రక్షణ కల్గించుటలో అమోఘమైనది. సర్వజన్మల పాపములను హరించి సుఖశాంతులను చేకూర్చునట్టి - ఈ యంత్రమును దీక్ష, నియమ, నిష్ఠలతో 40 రోజులు నిత్య షోడశోపచార పూజలు జరుపుచుండవలెను. ముందు తెల్పిన మూల మంత్రములలో ఒక దానిని ఒక మంత్రమును మాత్రమే ప్రతిరోజు 2500 సార్లు జపించుచూ, మొత్తము ఒక లక్ష జపము చేయవలెను. జప ఫలమును యంత్రమునకు ధారబోయవలెను. అందుచే యంత్రము శక్తి వంతమగును పిదప ఈ యంత్రమును శుభముహూర్తమున గృహమునందు స్థాపించుటయో లేక పూజామందిరము నందుంచి నిత్య పూజాదులు చేయవలెను.

**ఫలము :-** ఈ యంత్రము వలన ముఖ్యముగా సర్వత్రా రక్షణ చేకూరును. శత్రునాశన మగును. గ్రహదోషములన్నియు నివృత్తి యగును. గృహ యజమానికి అందు నివసించు వారికి సర్వరక్షగా యుండి నరఘోషను నివారించును. ఆకస్మిక ఉపద్రవముల నుండి కాపాడును. సకల ఐశ్వర్య అభివృద్ధి కలుగచేయును. అభిచార కర్మాదులచే సంభవించు సకల బాధలను నివృత్తి చేయును.

ఇంకను - గృహ వాస్తు విషయమైన సమస్త దోష ములను పరిహరించును. విశేషించి నైఋతి దిశలో గల బావుల వలన కలుగు దోషములు, ప్రహరీ గోడలు, వీధి శూలలు, దేవాలయ మూలక సమస్త దోషములను, మేడ పైకి నిర్మించు మెట్ల వలన సంభవించు దోషాదులను కూడా పరిహరించి - గృహయజమానికి, సతీ సుతులకు, సర్వులకు రక్షణ చేయుట యందు అమోఘమైన యంత్రము.

ఓం నమో నారాయణాయ

# ౩౨. శ్రీ మహావిష్ణు యంత్రము




శ్రీ మహా విష్ణు యంత్రము

## శ్రీ మహావిష్ణు మంత్రము

అస్యశ్రీవాసుదేవ స్వరూప శ్రీ విష్ణు మహా మంత్రస్య । ప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ విష్ణుర్దేవతా । ఓమ్ బీజమ్ । నమః శక్తిః । వాసుదేవాయేతి కీలకమ్ । అఖిలార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

మూల మంత్రేణ అంగన్యాస కరన్యాసమ్ కుర్యాత్ ॥

(అని చెప్పుకొనిన పిదప క్రిందచెప్పిన మంత్రము జపించాలి)

**మూల మంత్రము :-** ఓం నమో భగవతే వాసుదేవాయ । హ్రీం శ్రీం క్లీం శ్రీ మహా విష్ణవే । సర్వ రక్షకాయ నమః । స్వాహా ॥

# విష్ణు గాయత్రి

ఓమ్ నారాయణాయ విద్మహే । వాసుదేవాయ
ధీమహి । తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥

(పూజ, జపాదుల ఆద్యంతములందు ఈ గాయత్రి మంత్రమును 108 సార్లు జపించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేక వెండి రేకు మీద దైవజ్ఞులుచే తయారు చేయించుకొనవలయును. యంత్ర దశవిధ సంస్కారములు, ప్రాణ ప్రతిష్ఠ జీవకళాన్యాసములను జరిపించి శుభ కార్యము నందు దీక్షాన్వితులై పూజాదికములను ప్రారంభించవలెను.

**పూజా విధి :-** యంత్రమును 40 రోజులు షోడశోపచార పూజలతో సేవించుచు, మూల మంత్రమును ఒక లక్ష పర్యాయములు జపించవలెను. అనగా ప్రతినిత్యము **2500** సార్లు జపించి, ఆ జప ఫలమును యంత్రమునకు ధారబోయవలెను. దీని వలన యంత్రము శక్తి వంతమగును. ఈ విధముగా పూజ, జపాదులు పూర్తయిన పిమ్మట యంత్రమును గృహము నందు నిర్దిష్ట ప్రదేశమందు స్థాపించవలెను. లేదా పూజా మందిరము నందుంచి యధాశక్తి నిత్య సేవలు జరుపుచుండవలెను.

ఈ సృష్టి యందలి సకల చరాచర జీవులను పోషించి, రక్షించువాడు - ఆ శ్రీమన్నారాయణుడే కావున ఈ విష్ణు యంత్రము అన్ని విషయములలోను యోగ్య ప్రదమైనది.

**ఫలము :-** ఈ యంత్రపూజ వలన గృహస్తులకు సంతాన, సౌభాగ్యములు చేకూరి, సర్వ సంపదలు, వ్యాపారాదులు అభివృద్ధి నొందును. అంతేగాక, శత్రు, ఋణ, రోగ, ఈతి బాధలను సమస్తము నశింపచేయును. ప్రశాంత జీవనముతో నుండి, గౌరవాదులను, రాజ్యపూజ్యతలను, పొందగలరు. ఆర్థిక పుష్టి, మనస్సునకు సంతృప్తి సమకూరును.

అంతేగాక, గృహమునకు సంబంధించిన వివిధ రకములైన వాస్తుదోషములను పరిహరించును. విశేషించి పశ్చిమ సింహద్వారము గల గృహములకు సంబంధించినట్టి వివిధ దోషములు, రాక్షస స్థాన దోషములు, పాప రాక్షస, పితృగణ దోషములు, బ్రహ్మపద నిర్మాణ దోషములు, మృగ పదాదుల యందు నిర్మించిన గృహ దోషములు, ఆదిగా గల సమస్త దోషములను ఈ యంత్ర రాజము పరిహరించి గృహయజమానికి, వారి కుటుంబ సభ్యులందరికు సుఖశాంతులొసంగి, శాంతి జీవనమును కలుగ జేయును.

ఓం నమో భగవతే వాసు దేవాయ



# 33. మత్స్య యంత్రము




## మత్స్య మహా మంత్రము

అస్యశ్రీ మత్స్య మహామంత్రస్య। పరబ్రహ్మ ఋషిః । దైవీ గాయత్రీ ఛందః । మత్స్య స్వరూప మహా విష్ణుర్దేవతా । మం బీజమ్। నమః శక్తిః । అరిష్ట భంజనాయేతి కీలకమ్ । సర్వ సంపదస్సముద్ధ్యర్థే, సర్వాభీష్ట వృద్ధ్యర్థే జపే వినియోగః ॥

## మూల మంత్రము

1. ఓం హ్రీం శ్రీం మత్స్యాసనాయ । సోమకాసుర భంజనాయ । శ్రీ మహా విష్ణవే । శ్రీం హ్రీం ఓం అణిమా ద్యష్ట విభూతిమ్ దేహి దేహి స్వాహా ॥

2. ఓం ఆం హ్రీం క్రోం హ్రీం శ్రీం మం మత్స్య సనాయ । సోమకాసుర భంజనాయ । మహా విష్ణవే । అణిమాద్యష్ట విభూతిమ్ దేహి దేహి మమ సర్వ సౌఖ్యమ్ దాపయ దాపయ స్వాహా ॥

(ఈ రెండు మూల మంత్రములలో ఏదో ఒక మంత్రమును ఒక లక్ష పర్యాయములు జపించవలయును)

## మత్స్య గాయత్రీ మంత్రము

ఓమ్ తత్పురుషాయ విద్మహే । మహా మీనాయ
ధీమహి ! తన్నో మత్స్యః ప్రచోదయాత్ ॥

## మత్స్య యంత్ర గాయత్రీ మంత్రము

యంత్ర రాజాయ విద్మహే । మత్స్య యంత్రాయ
ధీమహి ! తన్నో యంత్రః ప్రచోదయాత్ ॥

## గాయత్రీ మంత్రము

ఓమ్ భూర్భువ స్సువః । తత్సవితుర్వ రేణ్యమ్ ।
భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ ॥

## మత్స్య యంత్ర విశిష్టత

శ్రీ మహా విష్ణువు యొక్క దశావతారములలో మొట్ట మొదట అవతారమే "మత్స్యావతారము" వేద సముద్ధరణకై అవతరించిన శ్రీ మహావిష్ణు రూపము. ఈ యంత్రము, ఇతర యంత్రముల కన్నా చాలా విశిష్టమైనది. "సమస్త వాస్తు దోష నివారణ యంత్ర రాజము" ముఖ్యముగా విశేషించి ఈ యంత్రము - వాని ప్రస్థారము నందు గల సప్తావరణల లోను అతి ముఖ్యము శక్తివంతమైన బీజాక్షరములతో రూపొందించబడి, సర్వ సాంప్రదాయాను కూలముగా నిర్మించబడినదీ యంత్రము.

## యంత్ర నిర్మాణం - పూజా విధి

ఈ మత్స్య యంత్రమును - (5' x 5') సైజు గల రేకు పై యంత్రమును శాస్త్రాను సారముగా దైవజ్ఞులచే తయారు చేయించుకొని, యంత్రసంస్కార జీవ కళాన్యాస, ప్రాణ ప్రతిష్ఠాదులను జరిపించి, శుభ సమయమున యంత్ర పూజ, జపాదులను ప్రారంభించవలెను. ఈ యంత్రమును శక్తి వంతముగా చేయుటకై

విధి విధానమును మిగిలిన యంత్రముల కన్న కొంచెము ఎక్కువగానే నిర్దేశింపబడినది. గావున ఆ విధముగా సర్వము దీక్షతో నిర్వహించి శుభంబులబడయవలసినదిగా ప్రార్ధన.

**పూజా విధి:** ఈ మత్స్య యంత్రమును 40 రోజులు దీక్షతో షోడశోపచార పూజలు నిర్వహించుచు నిత్యము సేవించవలెను. ప్రతి దినమున మత్స్య మహా మంత్రము అనగా ముందు తెల్పిన మూలమంత్రములలో ఒక దానిని మొత్తము ఒక లక్ష పర్యాయములు జపించవలెను. అనగా రోజునకు 2500 పర్యాయములు జపించవలసియున్నది. ఈ మూల మంత్రముతో పాటు గాయత్రీ మంత్రమును కూడా ప్రతి రోజు 2500 పర్యాయములు జపించవలెను. అట్లే మత్స్య గాయత్రీ మంత్రమును కనీసము పదివేల మార్లు జపించి - ఈ జప ఫల మంతయు యంత్రమునకు ధారబోసినచో - యంత్రము మహా శక్తి వంతమగును.

ఈ విధముగా 40 రోజులు పూజ, జపాదులు నిర్వహించిన పిదప, చివరిరోజున హోమము కూడా నిర్వహించవలయును. ఈ హోమమునకు మూలమంత్రముతో - ఆవు నెయ్యి, నల్ల నువ్వులు, బిల్వ ఫలములు, పాయసములతో - జపమునకు దశాంశము అనగా పదివేల పర్యాయములు హోమము నిర్వహించవలయును.

ఈ క్రియాదులు పరిపూర్ణమైన పిదప తారాబల, చంద్రబల యుక్త శుభ ముహూర్తమున యంత్రమును గృహము నందలి ఈశాన్య భాగమున గాని లేదా గృహ మధ్య భాగమున గాని స్థాపించాలి.

**ఫలము:** ఈ యంత్రము అత్యంత మహిమాన్వితమైన దగుటవలన, గృహమందలి సర్వారిష్టములను, సమస్త దోషములను సంపూర్ణముగా పరిహరించి, గృహ యజమాని, అందు నివసించు వారందరికి సుఖ సంతోషములు, ఆయురార్భాగ్యములు, పుత్ర పౌత్రాది సంతానాభివృద్ధిని చేకూర్చును. భోగభాగ్యములు, ధన ధాన్యాభివృద్ధి కల్గించును. కీర్తి, గౌరవ ప్రతిష్ఠలు పెంపొందించును. ఈ యంత్రము, ఆయా గృహస్తులకు వారి కోరికలను దీర్చు కామధేనువు మరియు కల్పతరువు. ఈ విధముగా సాధారణ గృహస్తులకు వారి జీవితములందు అత్యంత ఉపయుక్తమై యున్నది.

అంతేగాక - వాస్తు రీత్యా ఈ యంత్రము అత్యంత యోగకారి, శుభకారి మరియు సమస్త గృహస్థల వాస్తు దోష నివారిణి.

**వాస్తు దోష నివారణ :**

1. తూర్పు సింహద్వారముగల గృహము లందలి సమస్త దోషములను మాత్రమే గాక ఏదిశా దోషమైనను పరిహరించును.
2. ఈశాన్య స్థాన దోషములను, దక్షిణ, పశ్చిమ, ఉత్తర సింహద్వార్ గృహ దోషములను నివృత్తి చేయును.
3. గ్రహ దృష్టి దైవ దృష్టి , విప్ర దృష్టి ఆదిగా గల దృష్టి దోషములను పరిహరించును.
4. వర్గరాహిత్యము, స్థలాంతర్గత, స్థల పరిసర మరియు శాస్త్ర విహితముగాని సమస్త నిర్మాణ దోషములు పోవును.
5. సొంత గృహమైనను, అద్దె ఇల్లు అయిననూ గాని ఈ యంత్రమును గృహము నందుంచుట వలన విశేష లాభములను పొందగలరు.
6. గృహమునందే గాక - ఈ యంత్రమును పాఠశాలలు, వైద్యశాలలు, ఆఫీసులు,కర్మాగారము లందు కూడా ఉంచవచ్చును. సత్ఫలితముల నిచ్చును.
7. విశేషించి గ్రామ మధ్యమున స్థాపించిన - గ్రామ ప్రజలెల్లరు శుభంబుల నొందగలరు.
8. అభివృద్ధి సాధన కొరకు ఈ యంత్రమును ఉంచినచో - ఫలితము అమోఘము.
9. వాహనములందు కూడా ఈ యంత్రము ఉంచవచ్చునని శాస్త్ర ప్రమాణము. అందుచే యజమానికి ప్రమాదముల నుండి రక్షణకల్గును.

సర్వదోష నివారిణి, ఫల ప్రదాయిని ఈ మత్స్య యంత్రము, సత్ఫలితములకు, మన దీక్ష, నియమ నిష్ఠలే అతి ముఖ్యమైనవి.

హరిః ఓం



# 34. రుద్ర యంత్రము




రుద్ర యంత్రము

## రుద్ర మహా మంత్రము

అస్యశ్రీ రుద్ర మహా మంత్రస్య । తాపస పుత్రోః వసిష్ఠ ఋషిః । జగతీ ఛందః । శ్రీ రుద్రో దేవతా । ఓం బీజమ్ । నమః శక్తిః । యం కీలకమ్ । సమస్తోపద్రవ శాంత్యర్థే జపే వినియోగః ॥

హ్రామితి షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥
(అని చెప్పుకొనిన తర్వాత జపమును చేయవలెను)

## మూల మంత్రము

యో రుద్రో అగ్నౌ యో అప్సుజ ఓషధీషు యో
రుద్రో విశ్వా భువనాని సర్వాః ॥

## రుద్ర గాయత్రీ

ఓం తత్పురుషాయ విద్మహే మహా దేవాయ ।
ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥

( ఈ రుద్ర గాయత్రీ మంత్రమును కూడా నిత్యము 108 మార్లు జపించవలెను.)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి రేకు పై దైవజ్ఞులచే నిర్మింప జేసుకొని, యంత్ర దశవిధ సంస్కారములను, జీవకళాన్యాస, ప్రాణప్రతిష్ఠాదులను జరిపించవలెను. శుభముహూర్తమున పూజాదులను ప్రారంభించవలెను. దీక్ష, నియమములు ముఖ్యాతిముఖ్యములైనవి.

**పూజా విధి :-** ఈ యంత్రమును షోడశోపచార పూజలతో 40 రోజులు పూజించాలి. ప్రతి దినము మూలమంత్రమును యధాశక్తి జపించి, మొత్తము 40 రోజులలో ఒక లక్ష పదివేల పర్యాయములు జపించి, యంత్రమునకు ధార బోయవలెను. రుద్ర గాయత్రిని కూడా నిత్యము జపించు చుండవలెను. ఈ 40 రోజులు బ్రహ్మ చర్య దీక్షను కొనసాగించవలెను. ఒక్క రోజున మాత్రము శత రుద్రీయ మంత్ర సహితముగా, ఆవునెయ్యి, సమిధలు, నల్ల నువ్వులు, పాయసములతో - రుద్ర స్వాహాకార యుక్తముగా హోమము జరిపినచో యంత్రము శక్తివంతమై విశేష ఫలితములనొసంగును. పిదప ఆయా దోష స్థానము అందు స్థాపించవలెను.

**ఫలము :-** సర్వారిష్ట, అధర్మాదులను సంహరించువాడు - రుద్రుడు చైతన్యమూర్తి. ఈ యంత్రము వలన అకాల మృత్యు దోషము నివారణ యగును. శత్రు బాధలంతరించును. శిశునష్ట, ధననష్ట నివారణ యగును. ఆయురారోగ్య సంపదలను పెంపొందించును. నిజ జీవతమునందు సర్వ ఆటంకములు తొలగి కార్యానుకూలత చేకూరును.

విశేషించి వాస్తు రీత్యా దక్షిణ దిశ సింహ ద్వారము గల గృహ సంబధిత దోషములను నివారించును. దక్షిణ, ఆగ్నేయ దిశలో పెరుగుటచే కల్గు దోషములు, ఎత్తు, కొలతలు సరిలేని దోషము, దృశ్యా దృశ్యములగు అనేక రకములైన దోషములను పరిహరించి గృహ యజమానికి, సకల సుఖ సంతోషములను కల్గించి కష్ట నష్టముల నుండి విముక్తి చేయును.

'ఓం శివాయ పరబ్రహ్మణే నమః'
ఓమ్ శాంతి :



# 35. వరుణ యంత్రము




వరుణ యంత్రము　　　　మరొక విధము

## వరుణ మహా మంత్రము

అస్యశ్రీ వరుణ మహా మంత్రస్య । వసిష్ఠ ఋషిః । త్రిష్టుప్ ఛందః । వరుణో దేవతా । వం బీజమ్ । జూం శక్తిః । స్వాహా కీలకమ్ । ఆయురారోగ్య సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

వామితి షడంగన్యాసమ్ కుర్యాత్ ॥

(అని చెప్పుకొని జపాదులు నిర్వహించవలెను)

## మూల మంత్రము

ఓం భూర్భువ స్సువః । ఆం హ్రీం క్రోం వం వరుణాయ । పాశహస్తాయ । [illegible] ఆయుష్కారణాయ । అభీష్టమ్ దేహి దేహి స్వాహా ॥

## వరుణ గాయత్రీ

ఓమ్ హిరణ్య శృంగాయ విద్మహే । పాశ హస్తాయ ధీమహి !
తన్నో వరుణః ప్రచోదయాత్ !!

(నిత్యము మూలమంత్ర జపాద్యంతముల యందు ఈ గాయత్రీ మంత్రమును 108 పర్యాయములు జపించవలెను.)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి రేకు మీద శాస్త్రీయముగా దైవజ్ఞులచే రచింపజేసుకొని, యంత్ర సంస్కారాదులు జరిపించి, ప్రాణ ప్రతిష్ఠ, జీవకళాన్యాసాదులు గావించిన పిమ్మట శుభ కాలమునందు పూజాదులు ప్రారంభించవలెను.

**పూజా విధి :-** ఈ వరుణ యంత్రమును దీక్షగా నలుబది రోజులు షోడశోపచార పూజలతో సేవించవలెను. మూల మంత్రమును ఒక లక్ష పర్యాయములు సస్వరముతో జపించవలెను. అనగా ప్రతి రోజు 2500 పర్యాయములు జపించి, యంత్రమునకు ధార బోసినచో యంత్రము శక్తి వంత మగును. నలుబది రోజులు పూజ, జపాదులు పూర్తయిన పిమ్మట, యంత్రమును శుభ ముహూర్తమున గృహమునందు గల దోషస్థానమున స్థాపించవలయును.

**ఫలము :-** వరుణదేవుడు - జలములకు, పశ్చిమ దిశకు అధిపతి అగుటయేగాక, యజ్ఞ యాగాదులందు అవాహనము చేయు దేవతలందరిలో వరుణుడు చాలా ముఖ్యమైనవాడు. ఈ యంత్రము నుంచిన గృహములందు యజమానికి క్షేమ, విజయ, ఆరోగ్య, ఆయుర్వృద్ధి కలుగును. అకారణ శత్రుత్వము నశించును. శాంతి సౌఖ్యములను సమకూర్చును. సమస్త గృహపీడాది దోష నివృత్తి చేయును. శత్రువులు మిత్రులగుదురు. సంతానము ప్రయోజకులగుదురు. సక్రమ గృహ జీవాతానందము చేకూర్చును.

విశేషించి, వాస్తు రీత్యా పశ్చిమ సింహ ద్వార గృహ సంబంధిత వివిధ దోషములను, పశ్చిమ సరిహద్దు వెంబడి నిర్మాణ దోషములు, పశ్చిమ దిక్కు నీటివాలు దోషములు పరిహరించుటయేగాక, నైఋతి దిశ పెరిగి యున్నచో, ఆ దోషమును కూడా నివృత్తి చేయును. ఇట్టి పలు విధములగు వాస్తు దోష నివృత్తిని జేసి గృహ యజమానికి, అందు నివసించు వారికి సర్వానందమయ జీవితమును చేకూర్చును.

సం పట్టిల్
సం రాంజి

★★★★★

# 36. ఇంద్ర యంత్రము




## ఇంద్ర మహా మంత్రము

అస్యశ్రీ ఇంద్ర మహా మంత్రస్య ! బ్రహ్మ ఋషిః ! పంక్తీ ఛందః । ఇంద్రో దేవతా । లం బీజమ్ । జం శక్తిః । స్వాహా కీలకమ్ । సమస్తో పద్రవ నాశనార్థే జప వినియోగః ॥

లామితి షడంగ న్యాసమ్ కుర్యాత్ ॥
(అని చెప్పుకొనిన పిదప క్రింది మూల మంత్రమును జపించాలి)

## మూల మంత్రము

ఓమ్ నమో విశ్వరూపాయ । శచీ పతయే ।
స్వర్గ కామ ఫల ప్రదాయ । హ్రీం శ్రీం లం జం
వజ్ర పాణయే స్వాహా ॥

# ఇంద్ర గాయత్రీ

ఓం సహస్రాక్షాయ విద్మహే ! వజ్ర హస్తాయ ధీమహి!
తన్నో ఇంద్రః ప్రచోదయాత్ ॥

(ఈ గాయత్రీ మంత్రమును నిత్యము, జపాద్యంతముల యందు 108 పర్యాయములు జపించవలెను)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి రేకు మీద దైవజ్ఞులచే నిర్మింపజేసుకొని, సంస్కార విధులన్నియు జరిపి, ప్రాణ ప్రతిష్ఠ, జీవకళాన్యాసములను గావించిన పిమ్మట పూజాదులను శుభ ఘడియలలో ప్రారంభించవలెను.

**పూజా విధి :-** ఈ యంత్రమును, దీక్ష నియమాదులతో 40 రోజులు షోడశోపచార పూజలు నిర్వహించుచు, ప్రతి నిత్యము మూలమంత్రమును 2500 పర్యాయములు అనగా మొత్తము ఒక లక్ష పర్యాయములు జపించి యంత్రమునకు ధారబోసి, నిత్యము జపాద్యంతము లందు ఇంద్రగాయత్రీ మంత్రమును 108 మార్లు జపించవలయును. 40 రోజుల పిదప యంత్రమును శుభ. ముహూర్తమున గృహమునందు స్థాపించవలెను. ఈ యంత్రము అత్యుత్తమైనది. వజ్రాయుధ ధారియైన ఇంద్రుని శక్తి అమోఘము - అందు వలన ఈ యంత్రము వలన విశేష శుభ పలములు ప్రాప్తించుననుటలో ఎట్టి సందేహము లేదు.

**ఫలము :-** ఈ యంత్రము వలన - కుటుంబమందలి సమస్త చికాకులు, వ్యతిరేకతలు నశించి, సమస్త శత్రు నాశనము, వంశవృద్ధి, సర్వత్రా విజయము చేకూరును. గృహ యజమానికి పరిపూర్ణ సౌఖ్యానందములు, సంఘు గౌరవము , కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చి అత్యున్నత స్థాయిని కలిగించును. ఐశ్వర్యాభివృద్ధి కలును.

వాస్తు రీత్యా, విశేషించి, తూర్పు సింహ ద్వార గృహ సంబంధిత సర్వ దోషములు పరిహరించును. ఈశాన్య భాగ శల్య దోషములు నివృత్తి చేయును. అనుచిత నిర్మాణ దోషములు, స్థలము నందలి ఎత్తు పల్లములు దోషములు, అస్తవ్యస్త ప్రాకార, ద్వార నిర్మాణ దోషములును, ఉత్తర-ఈశాన్య భాగమందలి అనుచితమైన నిర్మాణ దోషములను పరిహరించి - గృహ యజమాని, అందు వసించు వారికి సమస్త సంపదలను, ఆయుర్భాగ్యములను చేకూర్చును.

ఓం నమో విశ్వ రూపాయా నమః

ఓం శాంతిః



# 37. కుజగ్రహ యంత్రము



కుజ గ్రహ యంత్రము

## కుజగ్రహ మహా మంత్రము

అస్యశ్రీ కుజగ్రహ మహా మంత్రస్య ! విరూప ఋషిః ! గాయత్రీ ఛందః ! అంగారకో దేవతా ! లం బీజమ్ ! ఖం శక్తిః ! హాం కీలకమ్ !ఇష్ట కామ్యఫలావాప్తయే జపే వినియోగః

హ్రాం లాం ఇతి అంగన్యాస కరన్యాసమ్ కుర్యాత్ ॥
(అని చెప్పుకొనిన పిదప క్రింది మూలమంత్రమును జపించవలెను)

## మూల మంత్రము

ఓం లం ఖం హాం ధరా సూనవే ! శ్రీ హ్రీం అంగారకాయ !
శక్తి శూల గదాధరాయ ! మహా రౌద్రాయ స్వాహా !!

## కుజ గాయత్రీ

ఓం అంగారకాయ విద్మహే ! శక్తి హస్తాయ ధీమహి !
తన్నో భౌమః ప్రచోదయాత్ !!

( ఈ కుజగాయత్రి మంత్రమును నిత్యము జపాద్యంతముల యందు 108 సార్లు జపించవలెను)

**యంత్ర నిర్మాణము** :- ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి రేకు మీద దైవజ్ఞులచే శాస్త్ర రీత్యా తయారు చేయించుకోవలయును. యంత్ర సంస్కారము, ప్రాణ ప్రతిష్ఠాదులు జరిపించిన పిమ్మట శుభముహూర్తమున పూజాదులు ప్రారంభించవలయును. నియమ నిష్ఠలు, దీక్ష చాల ముఖ్యమైనవిగా గ్రహించవలెను.

**పూజా విధి** :- ఈ యంత్రమును శాస్త్రోక్తముగా దీక్షతో 40 రోజులు షోడశోపచారములతో పూజించవలెను. మూలమంత్రమును ఒక లక్ష పర్యాయములు సస్వరముగా జపించవలెను. అనగా ప్రతి దినము 2500 పర్యాయములు జపించి, యంత్రమునకు ధారబోయుట వలన యంత్రము శక్తి వంత మగును. ప్రతిరోజు కుజగాయత్రి మంత్రమును కూడా 108 మార్లు జపించవలెను. ఈ విధముగా 40 రోజులు జప, పూజాదికములు పూర్తయిన పిమ్మట, తారాబల, చంద్ర బల యుక్త శుభ ముహూర్తమున గృహము నందు స్థాపించివలెను.

**ఫలము** :- రుద్రమూర్తి అయిన కుజడు - విష్ణు తేజస్సుతే భూదేవికి జన్మించినవాడు. అందుకే "ధరణీ గర్భ సంభూతం" అని చెప్పబడియున్నది. ఈ యంత్రము వలన ఋణ బాధలంతరించును. ఆర్థికముగా అభివృద్ధి చేకూరును. శత్రు నాశనము, కోర్టు వ్యవహార విజయము, భార్యా భర్తల మధ్య అన్యోన్యత చేకూరును. కళత్ర నష్టములు, పుత్రహాని, దాంపత్య జీవిత సుఖహాని నివారణమగును. వివాహము కాని వారికి కళ్యాణ యోగము కల్గును. సంతానము లేని వారికి సత్సంతాన యోగము చేకూరును. సర్వత్రా విజయ కార్య సిద్ధి, సర్వ జనాదరణము కల్గునటలో ఏమాత్రము సందేహము లేదు.

ప్రత్యేకించి భూమికి సంబంధమైన సకల వాస్తు దోషములను పరిహరించును. గృహమునందు గల శత్రుస్థాన, శత్రువర్గ నిర్మాణ దోషములను పాలద్రోలును. ఈశాన్య దిశా మెరక దోషములు, ఉప నిర్మాణ దోషములు, పశ్చిమ, దక్షిణ దిక్కులందు గల పల్లపుదోషములు, దూలముల క్రింద సింహ ద్వార నిర్మాణ దోషములను పరిహరించి గృహ యాజమానికి, వారి కుటుంబమునకు సర్వత్రా సుఖ జీవన యోగము చేకూర్చును.

ఓం శాంతిః



# 38. మరుత్ యంత్రము

(వాయు యంత్రము)




మరుత్ యంత్రము

## వాయు దేవతా మహా మంత్రము :

అస్యశ్రీ వాయు దేవతా మహా మంత్రస్య ! గణక ఋషిః ! నిచ్చృద్గాయత్రీ ఛందః । వాయుర్దేవతా! యం బీజమ్ ! నమః శక్తిః ! వాయవ ఇతికీలకమ్ ! అభీష్ట సిద్ధ్యర్థ్యే జపే వినియోగః !!

మూల మంత్రేణ షడంగ న్యాసమ్ కుర్యాత్ !!

(అని చెప్పుకొనిన పిదప క్రింద చెప్పిన మూలమంత్రం జపించాలి)

## మూల మంత్రము

ఓం యం యం వాయవే ప్రాణాధిపతయే సకల జీవాంతర స్థిత చైతన్య ప్రదాయ ! అంకుశ హస్తాయ స్వాహా !!

## వాయు దేవతా గాయత్రీ

ఓం సమీరణాయ విద్మహే ! అంకుశహస్తాయ ధీమహి !
తన్నో వాయుః ప్రచోదయాత్ !!

(ఈ గాయత్రీ మంత్రమును ప్రతినిత్య జపాద్యంతములందు 108 పర్యాయములు జపించాలి)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి రేకు పై యదాతథముగా దైవజ్ఞులచే తయారు చేయించుకోవలెను. యంత్రమునకు దశవిధ సంస్కార, ప్రాణ ప్రతిష్ఠ, జీవకళాన్యాసాదిక్రియలను నిర్వహించిన పిదప శుభ ఘడియలలో జప, పూజాదికములు ప్రారంభించవలెను. దీక్ష, నియమ నిష్ఠలు పాటించుట అత్యంతావశ్యకము.

**పూజా విధి :-** ఈ యంత్రమును యథాశక్తి 40 రోజులు షోడశోపచార పూజలతో సేవించవలయును. మూల మంత్రమును మొత్తము ఒక లక్ష పర్యాయములు సస్వరముగా జపించవలెను. అనగా ప్రతి రోజు 2500 పర్యాయములు జపించి యంత్రమునకు ధారబోయవలెను. జపాద్యంతముల యందు మరుత్ గాయత్రీ మంత్రమును ప్రతి నిత్యము 108 సార్లు జపించుచుండవలెను. ఈ విధమైన మండల పూజానంతరము, యంత్రమును శుభలగ్నమున గృహమునందు స్థాపించవలెను. ఇట్లు చేయుటచే - జీవులందరికి ప్రాణాధారమైన వాయు దేవత కృపచే సర్వ ుభములు చేకూరును.

**ఫలము :-** ఈ యంత్రముచే గృహమునకు నవచైతన్యము చేకూరి, శుభ ఫలితములకు పుష్టిని, తుష్టిని కల్గించి, నూతనోత్సాహము, కార్యసాధన, విజయములు కల్గును. స్వభావసిద్ధ ఫలితములు త్వరితగతిని చేకూరగలవు.

ముఖ్యముగా, గృహ - స్థలాదులకు సంభవించు వృక్ష వేధా దోషములు, శక్తి క్షీణ గృహ దోషములు, వాయువ్య దిశ వలన కల్గు దోషములు, వెన్ను పారు దప్పి కట్టిన దోషములు - మరియు వివిధ వాస్తు దోష నివారణయు జేసి సకల శుభంబులను చేకూర్చును.

ఓం శాన్తిః



# ౩౨. మహా మృత్యుంజయ యంత్రము



మహా మృత్యుంజయ యంత్రము

## మహా మృత్యుంజయ మంత్రము

అస్యశ్రీ మహా మృత్యుంజయ మహా మంత్రస్య ! వసిష్ఠ ఋషిః ! జగతీ ఛందః ! శ్రీ మృత్యుంజయో దేవతా ! హౌం బీజమ్ ! జూం శక్తిః ! సః కీలకమ్ ! సర్వాపన్నివారణ ద్వారా దీర్ఘాయుః ప్రాప్యర్థే జపే వినియోగః !!

హ్రామితి షడంగ న్యాసమ్ కుర్యాత్ !!

( అని చెప్పి మూల మంత్రము జపించాలి )

## మూల మంత్రము

ఓం హౌం బ్లూం జూం సః భూర్భువ స్సువః ! త్ర్యంబకమ్ యజామహే సుగంధిమ్ పుష్టివర్ధనమ్ ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ హౌం బ్లూం జూం సం ! స్వాహా !!

## లఘు మంత్రము

ఓమ్ నమః హౌం బ్లూం జూం సః శీం శివాయ స్వాహా !

(ఈ మంత్రము మోక్షా సక్తులకు సులభ సిద్ధి ప్రదము)

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5'' x 5'') సైజు గల రాగి లేదా వెండి రేకు మీద శాస్త్రాను సారముగా దైవజ్ఞులతో తయారు చేయించుకొని, దశ విధ యంత్ర సంస్కారములను, ప్రాణ ప్రతిష్ఠ, జీవకళాన్యాసాదులను జరిపించి శుభ ముహూర్తమున జప పూజాదికములు ప్రారంభించి, దీక్షతో శుచిగా పూర్తిగావించవలెను.

**పూజా విధి :-** ఈ యంత్రమును మండలము అనగా 40 రోజులు షోడశోపచార పూజలతో సేవించుచు, మూలమంత్రమును మొత్తము ఒక లక్షా పదివేల మార్లు జపించవలయును. అనగా ప్రతి నిత్యము నిర్దిష్ట సంఖ్యలో జపమాచరించవలెను. జపఫలమును యంత్రమునకు ధారబోయవలెను. ప్రతి రోజు జపాద్యంతము లందు సమస్త ఉపచారములను సమర్పించి, మండలము పూజాదులు పూర్తయిన పిమ్మట తారాబల, చంద్రబల యుక్త శుభలగ్నములో యంత్రమును గృహమునందు స్థాపించుటగాని లేక పూజయందుంచి నిత్య పూజాదులు జరుపుట గాని చేయవచ్చును.

**ఫలము :-** అమృత స్వరూపుడైన మృత్యుంజయుడు - గండములు, ఆకస్మిక ప్రమాదములు, అకాలమృత్యువును తొలగించి దీర్ఘాయురారోగ్యములు కలుగజేయును. సర్వగృహదోష నివారణ, శత్రు నాశనము చేయును. సంపూర్ణ ఆరోగ్యమును చేకూర్చును. దారిద్ర్యము నశింపచేసి సకల భాగ్యముల నొసంగును.

అంతేగాక, వాస్తురీత్యా దక్షిణ దిక్కున సింహద్వారముగల గృహ దోషములను, పశ్చిమదిశాది శల్య దోషములను, ఆలయాదుల శిఖర, స్తంభ దోషములను పరిహరించును. గ్రహ, విష ప్రయోగ నివృత్తి చేయును. సర్వ మంత్ర, యంత్ర, తంత్రములచే కలుగు సమస్త విపత్తుల నుండి రక్షణ చేకూర్చి ఆయురారోగ్యములను ప్రసాదించును.

ఓం శాంతి :

# 40. సిద్ధ గణపతి యంత్రము




సిద్ధ గణపతి యంత్రము

## సిద్ధ గణపతి మంత్రము

అస్యశ్రీ సిద్ధ గణేశ మహా మంత్రస్య ! బ్రహ్మ ఋషిః । గాయత్రీ ఛందః ! సిద్ధ గణపతి ర్దేవతా ! సిం బీజమ్ ! గం శక్తిః ! హ్రీం కీలకమ్ !సర్వారిష్ట నాశనార్థే! జపే వినియోగః !!

## మూల మంత్రము

ఓం ఆం హ్రీం క్రోం శ్రీం హ్రీం గం సిం సిద్ధ గణపతయే !
వర వరద సర్వ కార్య సిద్ధిమ్ ! దాపయ దాపయ స్వాహా !!

**యంత్ర నిర్మాణము :-** ఈ యంత్రమును - (5" x 5") సైజు గల రాగి రేకు పై దైవజ్ఞులచే నిర్మింపజేసి, దశవిధ సంస్కారముల నెఱపి, ప్రాణ ప్రతిష్ఠ, జీవ కళాన్యాసాదులను గావించి శుభ ముహూర్తమున పూజాదికములను ప్రారంభించవలెను. విశేష ఫలితములకై పూజాదులను "శుక్ల పక్ష చవితి నుండి ప్రారంభించి మరల శుక్ల పక్ష చవితి'' వరకు జప, పూజాదులను నిర్వహించి, చివరన హోమము చేయాలి.

**పూజా విధి :-** ఈ యంత్రమును ప్రతి నిత్యము షోడ శోపచార పూజలతో సేవించి, మూల మంత్రమును మొత్తము ఒక లక్ష పర్యాయములు సస్వరయుక్తముగా జపించవలెను. గాన ప్రతి దినము ఎంత జపము చేయవలయును నిర్దిష్ట సంఖ్యను ఏర్పరచుకుని నిత్య జపము చేయవలయును. పిమ్మట జప ఫలమును యంత్రమునకు ధారబోయ వలెను. పిదప తారాబల, చంద్రబల యుక్త శుభలగ్న, శుభ ఘడియలందు గృహమునందు స్థాపించవలెను.

**ఫలము :-** వ్యతిరేక విషయము సానుకూలమగుటయే "సిద్ధి'' అనబడును. అట్టి సిద్ధి నొసంగువాడు సిద్ధ గణపతి, గణపతికి గల 32 రూపములలో ఇది ఒకటి. ఈ మహనీయుని యంత్రస్థాపనచే గృహమందలి సమస్తవాస్తు దోషములను పరిహరించి గృహయజమానికి అందు నివసించు వారికి ఆయురారోగ్య సుఖ సంపత్తులను చేకూర్చును. సర్వారిష్టములను నశింపచేయును.

ప్రత్యేకించి - గృహ, స్థలాదులందుగల సమస్త వాస్తు దోషములను, వాయువ్య దిక్కున నున్న శల్య దోషములు నివృత్తి చేయును. అకారణ శత్రుత్వము నశించును. వ్యసనముల బారి నుండి విముక్తి జేయును. సర్వ శుభంబులు కల్గించునది. సర్వసిద్ధి ప్రదాయిని ఈ యంత్రరాజము.

ఓం శాన్తి
"సమస్త సన్మంగళాని భవంతు''
సర్వే జన భవంతు సుఖినః

